# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళ కథ సిహెచ్. రాంబాబు రచన. ఈ కథ [''దొంగను పట్టినవాడు''] పూర్తిగా మనస్తత్వ పరిశీలన మీద ఆధారపడినది. ''తగిన సలహాలు'', ''ఇద్దరు మంత్రులు'', ''యథారాజా, తథాప్రజా'' అన్న కథలలో వేరు వేరు రాజనీతులు న్నాయి: రాజుకు తాత్వికదృష్టి పనికిరాదు; రాజకీయ బాధ్యతలు గల వాళ్ళు దర్పాలకు పోరాదు; రాజుగారు శాసనాల ద్వారా కన్న తన ప్రవర్తన ద్వారా ప్రజలను మార్చగలుగుతాడు.

సంపుటి 55 డిసెంబర్ '74 సంచిక 6





# మిత్రభేదం

## 18

ఈ మాట విని దమనకం తనలో, "వీడికి చాలా బలం ఉన్నది. వాడిగల కొమ్ములు ఉన్నాయి. విధి కలిసి వస్తే, వీడు నా యజమానిని యుద్ధంలో చంపినా చంపవచ్చు. అలా ఎన్నటికీ జరగరాదు. అందుచేత వీడి బుద్ధి యుద్ధం మీది నుంచి మళ్ళేటట్టు చెయ్యాలి," అనుకుని, పైకి, "మిత్రమా, అవతలి వాడి బలం అంచనా వెయ్యకుండా యుద్ధానికి తలపడి లాభం లేదు. నీ వంటి ఎద్దు పింగళకం లాంటి సింహంతో ప్రత్యక్ష పోరాటానికి దిగి గెలవటం ఎలా సాధ్యమవుతుంది? అందుకు శక్తివంతులా, యుక్తిపరులా సహాయం ఉండాలి. వెనకటికి ఉల్లంకి పిట్ట అలాగే కదా సముద్రాన్ని గెలవ గలిగింది?" అన్నది.

"ఏమిటా కథ?" అని సంజీవకం దమనకాన్ని అడిగింది.

దమనకం ఇలా చెప్పింది:

### సముద్రాన్ని జయించిన ఉల్లంకిపిట్ట

ఒక మహా సముద్రం తీరాన ఉల్లంకి పిట్టల జత ఉండేది. ఆడపిట్ట గర్భిణిగా ఉండి, గుడ్లు పెట్టటానికి మంచి స్థలం చూడమని తన భర్తను అడిగింది.

"మనం ఉంటున్న ఈ సముద్ర తీరానే గుడ్లు పెట్టు. ఇది మనకు అనాదిగా వున్న స్థానం," అన్నది మగపిట్ట.

"వద్దు, వద్దు. సముద్రం మరీ దగ్గిరలో ఉన్నది. సముద్రం పొంగినప్పుడు నా గుడ్లు కాస్తా కొట్టుకుపోవచ్చు," అన్నది ఆడపిట్ట.

"పిచ్చిదానా, సముద్రం నన్ను అలా అన్యాయం చేయటానికి సాహసించలేదు.

---

అట్ట చివరి బొమ్మ

---



దానికి నా సత్తా తెలుసు. ఎన్నో చేపలూ, ఇతర ప్రాణులూ తనలో సుఖంగా జీవిస్తుండగా సముద్రం అలాటి పని తెగించి చెయ్యగలదా?'' అన్నది మగపిట్ట.

ఆడపిట్టకు తన మొగుడి సామర్థ్యం తెలుసు గనక, '' అలా ప్రగల్భాలు పలికి అపహాస్యంపాలు కాబోకు. నీ కున్న బల మెంతో ఎరగవా? వాచాలత్వం తోనే గదా తాబేలు నాశనమయింది?'' అన్నది.

''ఏమిటా కథ?'' అని మగ పిట్ట అడిగింది.

ఆడ పిట్ట తాబేలు కథ ఇలా చెప్పింది:

ఒక చెరువులో కంబుగ్రీవం అనే తాబేలు ఉండేది. దానితో సంకటం, వికటం అని రెండు కొంగలు స్నేహంగా ఉండేవి. కొంత కాలానికి నీటి కరువు వచ్చి, చెరువు ఎండి పోసాగింది. అందు చేత కొంగలు మరొక చెరువుకు మారదలచుకుని, ఆ సంగతి తమ మిత్రుడైన తాబేలుతో చెప్పాయి.

''మీ కన్న నేను ఎక్కువగా నీటిలో జీవిస్తాను. నన్ను కూడా ఎలాగైనా ఇక్కడి నుంచి తీసుకుపోయే మార్గం చూడండి,'' అన్నది తాబేలు.

''నువు ఎగరలేవు గద! మేం ఏం చెయ్యగలం? ఇలా రాసి పెట్టి ఉన్నది,'' అన్నాయి కొంగలు.

''మిత్రులారా, ఆపదలో నిరాశ పనికి రాదు. ధైర్యం ఉన్న వారికి ఏదో మార్గం దొరుకుతుంది. వివేకవంతులు తమ ఆప్తులను కాపాడాలని మనుధర్మశాస్త్రం చెబుతున్నది,'' అన్నది తాబేలు.

మూడూ చాలాసేపు ఆలోచించిన మీదట తాబేలుకు ఒక ఉపాయం తట్టింది. ఒక కర్రపుల్ల తెచ్చి, దాన్ని కొంగలు రెండు చివరలా ముక్కులతో పట్టుకుని, తాను దాని మధ్య భాగాన్ని నోటితో పట్టుకుంటే, కొంగలు ఎగురుతూ తనను కూడా తీసుకుపోవచ్చు!

ఈ పద్ధతి చాలా ప్రమాదమనీ, దారిలో తాబేలు మాట్లాడటానికి ప్రయత్నిస్తే

ప్రాణం పోతుందనీ కొంగలు అన్నాయి. దారిలో తాను నోరు విప్పనని తాబేలు ప్రమాణం చేసింది. కొంగలు ఒక కర్ర పుల్ల తెచ్చి, దాని మధ్య భాగాన్ని తాబేలును నోటితో పట్టుకోమని, తాము దాని చివరలు ముక్కులతో పట్టుకుని, పడితే ప్రమాదం లేకుండా కొద్ది ఎత్తులోనే ఎగురుతూ పోసాగాయి.

అవి ఒక ఊరు మీదిగా పోతూండగా గ్రామస్థులు కొంగలనూ, తాబేలునూ చూసి హాస్యాలాడసాగారు. తాబేలుకు కోపం వచ్చి, "ఈ మనుషులకు బుద్ధి లేదా?" అనబోయింది. కాని మాట పూర్తి కాకుండానే కింద పడింది. గ్రామస్థులు దాన్ని పట్టుకుని, చంపి తినేశారు.

అడ ఉల్లంకి పిట్ట తాబేలు కథ చెప్పి, ఇంకా ఇలా అన్నది :

"అరణ్యం మధ్య ఒక మడుగులో అనాగతవిధాతా, ప్రత్యుత్పన్నమతీ, యద్భవిష్యతీ అనే మూడు పెద్ద చేపలు స్నేహంగా ఉండేవి. ఒకనాడు కొందరు జాలర్లు ఆ మడుగు పక్కగా పోతూ, 'ఈ మడుగులో చాలా పెద్ద పెద్ద చేపలున్నాయి. రేపు వచ్చి పట్టుకుందాం,' అనుకున్నారు. ఈ మాటలు అనాగత విధాత విన్నది. అది అందోళనపడి తన మిత్రులను పిలిచి, 'మనం మరొక మడుగుకు వలస పోదాం,' అన్నది.

"ప్రత్యుత్పన్నమతి నవ్వి, 'రాబోయే దాన్ని గురించి ముందుగానే దిగులు పడటం దేనికి? నేనిక్కడ చాలా కాలంగా సుఖంగా ఉన్నాను. ఎన్నో అపాయాలను యుక్తిగా తప్పించుకున్నాను. జాలర్లు బహుశా రారు, వచ్చినా నేను ఉపాయంగా తప్పించుకోగలను,' అన్నది. యద్భవిష్యతి కూడా, 'నాకూ వెళ్ళే ఆలోచన లేదు. ఇంకెక్కడా చేపలు లేనట్టు జాలర్లు ఈ మారుమూల మడుగుకు ఎందుకు వస్తారు? ఒకవేళ ఇలా జరగాలని రాసి పెట్టి ఉంటే దాన్ని ఎవరు తప్పించగలరు?' అన్నది. ఇది విని అనాగతవిధాత మరొక మడుగుకు వెళ్ళింది.





# 6

[కవలలు ముగ్గురిని పక్షులు ఎత్తుకుపోయిన తరవాత, రాజు వాళ్ళను తెచ్చిన వారికి రాజ్యం యిస్తానని చాటింపు వేయించాడు. అది విన్న భద్రపురి వాసులైన ముగ్గురు కవలసోదరులు ఉదయనుడు, నిశీధుడు, సంధ్యాకుమారుడు అనేవాళ్ళు, రాజుగారి దగ్గిరకు వచ్చి, ఆయన యిచ్చిన గుర్రాల మీద, విచిత్రకవలలను వెతికేందుకు బయలుదేరారు. తరవాత—].

తెల్లగుర్రం పైన ఉదయనుడు ముందు పోతున్నాడు. పట్టపగలు కావటం వల్ల ఉదయనుడికి బాధ లేదు. కాని, సంధ్యా, నిశీధుల సంగతేమిటి? వాళ్ళకు కళ్ళు వుండి కూడా గ్రుడ్డివాళ్ళ కిందనే లెక్క కదా! అందుచేత దారి తెలియకపోయినా, ముందు పోతున్న ఉదయనుడి గుర్రపు డెక్కల చప్పుడు ఆనవాలుగా పెట్టుకుని, అతని వెంటనే పోతూవున్నారు.

క్రమంగా సూర్యుడు పడమటికి క్రుంగ జొచ్చాడు. ''నా పని అయిపోయింది. ఇక నువ్వు దారి చూపు, సంధ్యా.'' అన్నాడు ఉదయనుడు. ఆ మాట ప్రకారం ముందు సంధ్య దారి తీయగా, అతని వెనక నిశీధుడు, ఆ వెనక ఉదయనుడు వెళుతున్నారు.

అలా పోయిపోయి బాగా చీకటిపడే వేళకు, వాళ్ళు ఒక పెద్ద అరణ్యం చేరు



కున్నారు. చీకటి పడటం వల్ల యిక ఉదయనుడూ; సంధ్యా యిక విశ్రాంతి తీసుకోవలసిన వాళ్ళే. కాని, అర్ధరాత్రి వేళ ఆ నట్టడివిలో, ఎక్కడ విశ్రాంతి తీసుకోవటం? అప్పుడు నిశీధుడు వాళ్లని ఒక చెట్టు పైన కూర్చోబెట్టి, "మీరు యిక్కడే వుండండి. నేను పోయి యీ రాత్రికి మీరు తల దాచుకునేందుకు వీలైన చోటు ఎక్కడైనా వుందేమో చూచి వస్తాను." అని వాళ్ళ గుర్రాల్ని, ఆ చెట్టుకే కట్టివేసి తన నల్లగుర్రం పైన బయలు దేరాడు.

నిశీధుడు చాలా దూరం పోయి చివరకు, ఆ అరణ్యం మధ్యలో ఒక పాడు బడ్డ ఇంటి వద్దకు చేరుకున్నాడు. వాకిలి దగ్గిరికి వెళ్ళి, తలుపుతట్టి చూచాడు. జవాబులేదు. కిటికీ దగ్గిరికి వెళ్ళి తొంగి చూచాడు; లోపల అలికిడి ఏమీలేదు. ధైర్యం చేసి తలుపు తెరుచుకుని, ఇంట్లో ప్రవేశించాడు. ఏ మూల చూచినా, నార పీచు కుప్పలే. అంతకు తప్ప ఆ ఇంట్లో విచిత్రమేమీ లేదు. ఇంటి యజమాని ఎవరో చూద్దామని, కొంతసేపు అక్కడే వేచి వున్నాడు.

నిశీధుడు అలా చాలా సేపు చూచినా, ఎవరూ రాకపోయేసరికి, అది ఏదో పాడుబడిన ఇల్లు అయి వుంటుందనుకున్నాడు. తనకూ, తన సోదరులకూ ఇది తల దాచుకోటానికి తగిన స్థలమేనని నిశ్చయించుకొని, తిరిగి నల్లగుర్రం పైన బయలుదేరి, ఉదయనుడూ, సంధ్యా వున్న చెట్టు వైపుకిసాగాడు.

నిశీధుడు అక్కడ సోదరులను కూర్చోబెట్టి వచ్చేసిన మరుక్షణముందే ఉదయనుడూ, సంధ్యా ఎక్కిన చెట్టు కింద, ఏదో అలికిడి అయింది. పురుగూ పుట్రా వుండే అడవి కదా, అటువంటి దేదైనా అయివుంటుందనుకుని వాళ్ళు ఆత్రంతో నిశీధుడి కోసం ఎదురుచూస్తూ వున్నారు.

ఉన్నట్టేవుండి ఉదయనుడు తన నడుము చుట్టూ తడిమి చూచుకొని,

"సంధ్యా! ఏదో నారపీచు లాగా తగులుతోంది, ఏమిటో నడుముకి," అనబోయాడు.

ఉదయనుడి నోటినుంచి, ఈ మాటలు పూర్తిగా వచ్చాయో లేదో, సంధ్య కూడా, "అవును, నా నడుముకీ అలాగే తగులుతోంది. నీవు చెప్పినట్టు ఏదో నారపీచు లాగానే కనబడుతూ వుంది. ఏమై వుంటుంది చెప్మా?" అని ఆలోచించసాగాడు.

ఇలా వాళ్ళు ఆలోచిస్తూ వుండగానే, వాళ్ళ నడుముచుట్టూ ఏదో తాడు బిగించి లాగబడుతున్నట్టు యిద్దరూ గ్రహించారు. చేతులతో చుట్టూ తడిమిచూచారు. ఎక్కడా మనిషి అలికిడి కనిపించలేదు.

ఇంతలో, "మహామహా వాళ్ళకే, నేను కనిపించలేదు. మీకా కనుపించేది?" అనేమాటలు వినిపించినై.

ఎప్పుడైతే యీ మాటలు వినిపించినయ్యో, అప్పుడు తమని ఏదో దెయ్యమో, భూతమో యిలా తాటితో బిగించివుంటుందని, ఉదయనుడూ, సంధ్యా తెలుసుకున్నారు. కాని, ఏమి చెయ్యాలో తోచింది కాదు. "సమయానికి మా నిశీధుడు లేకపొయ్యాడు గాని, ఉంటే నీ అంతు కనుక్కొనివుందుము. ఇప్పటికైనా మించిపోయింది లేదులే. మా అన్నయ్య





యీపాటికి బయల్దేరి వస్తూవుంటాడు. వాడు వచ్చేలోగా మర్యాదగా, మమ్మల్ని వదిలిపోతావా సరేసరి, లేదా యీరోజునే నిన్ను యమలోకానికి పంపించివేస్తాడు." అని బెదిరించి చూచారు.

కాని, ఆ వచ్చినవాడు సామాన్యుడా? "ఓస్! మీ బెదిరింపులు నా దగ్గరనా? మీ అన్నయ్యలాటి వాళ్ళు ఒకరుకాదు. వందమంది వచ్చినా, నన్నేమీ చెయ్యలేరు. అయినా మీ అన్నయ్య వచ్చేవరకూ నేను యిక్కడ వుండబోయాను గనకనా?" అంటూ ఆ వచ్చినవాడు, వాళ్లని తన గడ్డం చివర కట్టి చరచరా సాగిపోయాడు. పోతూపోతూ ఆ వచ్చినవాడు, మరొక కొంటె పని కూడా చేసిపోయాడు. చెట్టుకి కట్టి వున్న రెండు గుర్రాల పైనా ఏదో భస్మం చల్లాడు. అలా చల్లటంతోటే, అవి రెండూ మాయమైపోయాయి.

మరి కొంతసేపటికల్లా నిశీధుడు చెట్టు వద్దకు వచ్చి చూచేసరికి ఏమున్నదీ — చెట్టు పైన తన సోదరులూ లేరు, చెట్టు క్రింద వాళ్ళ గుర్రాలూ లేవు. అతనికి ఏమీ తోచింది కాదు. ఒకవేళ తను రావటం ఆలశ్యం అయిందని చెప్పి, వాళ్ళు తనని వెతుక్కుంటూ మరో దారిన వెళ్ళారేమో ననుకుని, సోదరులను వెతుక్కుంటూ, తన నల్లగుర్రం పైన తిరుగుముఖం పట్టాడు.

అలా వెతుక్కొంటూ నిశీధుడు, ఆ మహారణ్య మంతటా కలియతిరిగాడు. కాని, ఎక్కడా వాళ్ళ అనవాలు చిక్కిందే కాదు. అప్పటికి రాత్రి కూడా చాలా భాగం గడిచిపోయింది. మరో రెండు గంటలలో తెల్లవారబోతుంది. తీరా తెల్లవారిందీ అంటే తను ఒక్క అడుగైనా ముందుకు వెయ్యలేడు. అందుచేత ఆఖరు ప్రయత్నంగా, మరొక్కసారి అడవి అంతా గాలించాడు. లాభం లేకపోయింది.

నిశీధుడికి చివరకు ఒక ఆలోచన తట్టింది: "ఒకవేళ వాళ్ళు నేను చూచి

వచ్చిన. ఆ ఇంటికి వెళ్లారేమో!" అను కున్నాడతను. ఈ ఆలోచన స్ఫురించ గానే, గిరుక్కున మళ్ళీ, తిరుగా ఆ పాడు బడిన యింటికి వచ్చి చేరుకున్నాడు. తన సోదరులు గుర్రాలను బైట కట్టివేసి వుంటారు కదా అని తలిచాడు, నిశీ ధుడు. కాని, అలా ఏమీ కనిపించక పోయేసరికి, నిరాశ చెందవలసి వచ్చింది. అయినా చూద్దామని చెప్పి తలుపు తోసు కుని ఇంట్లోకి వెళ్ళాడు. ఎంత వింత! ఒక లావుపాటి నార త్రాటితో కట్టబడి ఉదయనుడూ, సంధ్యా ఆ గది మూల నిద్రిస్తూవున్నారు. పైగా, వాళ్ళకి దగ్గిర లోనే నేల మీద నెత్తురు చుక్కలు కను పిస్తున్నై. అంతకంటే ఘోరం - ఉదయ నుడి చెయ్యి ఒకటి మాయమైపోయింది. పోనీ అంటే, నరికి వేసిన గుర్తయినాలేదు.

ఇదంతా చూచి నిశీధుడికి మతి పోయి నట్టనిపించింది. కొంతసేపటికి స్థిమితం తెచ్చుకొని, సోదరులను తట్టి లేపాడు. నిశీధుణ్ణి చూడగానే వాళ్ళకి ప్రాణం లేచి వచ్చింది. "తమ్ముడూ! ఆ దుర్మా ర్గుణ్ణి తప్పించుకుని ఎలా వచ్చావురా? మళ్ళీ మనం కలుసుకుంటామని ఆశ పడనే లేదు మేము," అంటూ నిశీధుణ్ణి కౌగలించుకుని కన్నీరు కార్చారు సోదరులిద్దరూ.

"మీకు వచ్చిన భయంలేదు. విచా రించకండి. ఇక్కడికెలా వచ్చారు మీరు? ఈ కట్లేమిటి? అన్నయ్యా, నీ చెయ్యే





మయింది? ఈ నెత్తురు చుక్కలేమిటి?'' అని ప్రశ్నలు కురిపించాడు నిశీథుడు.

''ఇదంతా మన దురదృష్టం, తమ్ముడూ!'' అని ఉదయనుడు యిలా చెప్పసాగాడు: ''నీవు మమ్మల్ని వదిలి వెళ్ళిన కాసేపటికల్లా, మమ్మల్ని ఎవడో తాటితో కట్టి తెచ్చి, ఈ ఇంట్లో పడేశాడు. ఆ దుర్మార్గుడు ఎవడో, మమ్మల్ని ఎక్కడికి తీసుకుపోతున్నాడో మేము చీకటిలో తెలుసుకో లేకపోయాం. ఎప్పుడు తెల్లవారుతుందా అనేదే మా ఆరాటం. ఇప్పుడిప్పుడే తెల్లవారబోతున్నది కనుక, నేను కొంచెం చూడగలిగాను. మమ్మల్ని యిక్కడికి కట్టి తెచ్చినవాడు ఒక విచిత్రమైన మనిషి. వాడిని చూస్తే మాకు నవ్వూ వచ్చింది, కోపమూ వచ్చింది. భూమికి సరిగా జానెడంటే జానెడెత్తునే వున్నాడు. కాని చిత్రమేమిటంటే వాడికి వంద జానెలు పొడుగు గల గడ్డం వుంది. ఆ గడ్డాన్నే మా నడుముకు చుట్టి, తాడులాగా పేనాడు. ఇప్పటివరకు వాడూ మా ప్రక్కనే పడుకుని వున్నాడు. ఇప్పుడే లేచి ఎక్కడికో పోయినట్టుంది. వాడు లేచేసరికి యిక్కడ నేల మీద నీ పాదాల గుర్తులు కనిపించినై. అవి కంట పడగానే అగ్గిరగులుస్తూ, 'ఓహో, మీ పెద్దన్న యిక్కడికి వచ్చి వెళ్ళినట్టున్నాడే? సరే వుండండి. వాడిని కూడా పట్టి తెస్తాను,' అంటూ గభీమని లేవబోయాడు. ఆ తొందరలో వాడు మమ్మల్ని తన గడ్డానికి కట్టుకున్న సంగతే మరిచిపోయినట్టుంది! నాకు వళ్ళుమండి వాడి గడ్డం పట్టుకు పీకేసరికి, నాలుగు పీచులు కుదుళ్ళ కంటా వూడి వచ్చి, బొలబొలా రక్తం కారింది. వాడు కళ్ళవెంట చింతనిప్పులు కక్కుతూ, 'ఔరా, ఎంత పొగరు నీకు? ఇంకా నయంలే, గడ్డమంతా ఊడ లాగేశావు కావు,' అంటూ కసిరాడు.

''తరవాత వాడు కోపంతో ఊగిపోతూ, 'ఈ గడ్డమే నాకు పంచప్రాణాలు అయి వుంది. ఇందులో ఒక్క వెంట్రుక రాలిం

దంటె, ఒక ప్రాణం ఎగిరిపోయిందన్న మాటె కదా. ఇప్పుడీ పొగరుబోతు, నాలుగు పొడుగుపాటి కేశములు పీకి వేశాడే. అవి మళ్ళా యీ జన్మలో మొలిచే ఆస్కారమూ లేదు. ఎలా అహోరించేది?' అని గొణుగుకుంటూ, 'అరేయ్, నీ నేరానికి ఇదే తగిన శిక్ష, అనుభవించు!' అంటూ జేబులోంచి ఏదో అంజనం తీసి, నా భుజానికి పూశాడు. అంతే, ఆ మరుక్షణమే నా చెయ్యి మాయమైపోయింది. ఈ పని చేసిన తర్వాత వాడు తన గడ్డాన్ని మమ్మల్ని కట్టుకున్నంతవరకు కత్తిరించుకుని, సులువుగా లేవగలిగాడు. కాని చిత్ర మేమిటంటె, ఆ పొడుగు గడ్డం మళ్ళీ ఎప్పటిలాగానే తయారై వుంది,'' అని చెప్పి ముగించాడు. ఇదంతా విని నిశీధుడు చాలా ఆశ్చర్యపోయాడు.

ఇంతలోకే బాగా తెల్లవారింది. అప్పుడు ఉదయనుడు, ''సరే ఇంక ఆలశ్యం చెయ్యటం దేనికి? వాడు నీకోసం తిరిగి తిరిగి వేసారి, ఈ పాటికి మళ్ళీ యిటు వస్తూండి వుండాలి. తెల్లవారింది కనుక, నిశీధా, యిక నీవల్ల ఏమీ ప్రయోజనం లేదుకదా? అందుచేత నా బదులు నిన్ను సంధ్యతో కలిపి కట్టివేస్తాను. ఒక చెయ్యి మాత్రమే పైకి కనిపించేట్టు జాగ్రత్తగా



కూర్చుని వుండు. తర్వాత సంగతి చూచుకొందాం,'' అన్నాడు.

సరేనంటే సరేననుకున్నారు ముగ్గురూ. వెంటనే నిశీధుడు వాళ్ళ కట్లు విప్పాడు. ఉదయనుడు లేచి నిశీధుణ్ణి సంధ్యతో పాటు కట్టి పడేశాడు. బైటవున్న నిశీధుడి నల్లగుర్రాన్ని అక్కడ దగ్గర్లో ఒకగుహలో కట్టేసి, తను మాత్రం ఇంటికి దగ్గర్లోనే, ఒక పొదమాటున నక్కి వున్నాడు.

సరీగ్గా మధ్యాహ్నం అయేవేళకు, ఆ బారెడు గడ్డపు జానెడు మనిషి, ''కానివ్వు, ఎక్కడికి పోతాడు? ఇవాళ కాకపోతే రేపు. అంతే కదా? అహహా, అహహా!'' అంటూ విరగబడి నవ్వుతూ,

ఉదయనుడు దాగివున్న పొద పక్క నించే పోయాడు.

వాడిని ఇంట్లోకి పోనిచ్చి, ఉదయనుడు మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ ఒక కిటికీ దగ్గరచేరి, ఇంటిలోపలికి తొంగి చూచాడు. అప్పుడు ఒక చిత్రమైన విషయం ఉదయనుడి కంటబడింది. ఆ బారెడు గడ్డపు జానెడుమనిషి జేబు నుంచి ఏదో మందు తీసి, నిశీధుడి పైన, సంధ్య పైన చల్లాడు. వెంటనే వాళ్ళు ఆనవాలైనా లేకుండా మాయమైపోయారు. ఆ తర్వాత వాడు, తన మెడలో వున్న ఒక దండ తీసి, అక్కడ ఒక వంకెకు తగిలించాడు. దండ తీసి వేశాడో లేదో వాడు మామూలు మనిషి అయిపోయాడు. ఆ గడ్డమూ లేదు, ఏమీ లేదు.

ఇదంతా ఉదయనుడు కిటికీలో నించి కనిపెడుతూనే వున్నాడు. మెడలో వున్న దండ తీసి వేసి, వాడు గుర్రుపెట్టి నిద్ర పోయాడు. అదే అదను చూచి ఉదయనుడు మెల్లగా యింట్లో ప్రవేశించి, ఆ దండ కాస్తా కాజేసి తెచ్చి, తన మెడలో వేసుకున్నాడు. ఇంకేముంది, ఉదయనుడు వెంటనే బారెడు గడ్డపు జానెడు మనిషిగా మారిపోయాడు. ఈ వింత మార్పు చూచి ఉదయనుడికి నవ్వు వచ్చింది. "ఓహో, ఇదా నీ కిటుకు!" అనుకున్నాడు మనసులో.

ఉదయనుడు తన చొక్కాకు గల జేబులన్నీ తడిమి చూసుకున్నాడు. ఒక జేబులో ఏదో తెల్లటి భస్మం వుంది. చెట్టు క్రింద గుర్రాల్నీ, యింట్లో మనుషుల్నీ గెడ్డం వాడు మాయం చేసింది, ఈ భస్మం తోటే. రెండో జేబులో ఒక ఎర్రని అంజనపు డబ్బీ వుంది. ఉదయనుడి చెయ్యి పోగొట్టింది, ఈ అంజనం రాచే. మూడో జేబులో అలాటిదే మరొక పచ్చని అంజనపు డబ్బీ, ఒక పెద్ద తువ్వాలూ, ఇంకా మరి ఏదో నల్లని భస్మమూ వున్నై. ఐతే, వాటిలో ఏది ఎందుకు ఉపయోగిస్తుందో ఉదయనుడికి బోధపడలేదు.

—(ఇంకా వుంది)





# దొంగను పట్టినవాడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు ఎవరికి మాట యిచ్చి ఇలా శ్రమపడుతున్నావో తెలియదుగాని, ఒక్కొక్కసారి మాట నిలబెట్టుకునేటం దుకు కూడా అధర్మంగా ప్రవర్తించవలసి రావచ్చు. ఇందుకు నిదర్శనంగా నీకు విక్రమసేనుడు అనే రాజుకథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం భావన అనే రాజ్యాన్ని విక్రమ సేనుడు పాలించేవాడు. ఆయన రాజ్య పాలనలో అతి సమర్థుడు. యుద్ధంలో ఆయన అపజయం ఎరగడు. చుట్టు పక్కల అనేకమంది రాజులు ఆయనకు



సామంతులై, అంతులేని కప్పాలు చెల్లించే వారు. విక్రమసేనుడి ఖజానాలో లక్ష్మి తాండవిస్తూ ఉండేది.

అయితే కొంత కాలం గడిచినాక ఖజానాలో ధనం విచిత్రంగా తరగ సాగింది. ఎవరో యుక్తిగా ఖజానాను కొల్లగొట్టుతున్నట్టు రాజుకు అనుమానం కలిగింది. దొంగలను పట్టటానికి ఆయన ఎన్నో బందోబస్తులు చేశాడు. తాను స్వయంగా రాత్రిపూట గస్తీ తిరిగాడు. కాని ఖజానాలో సొత్తు తరిగి పోతూనే వచ్చింది.

చివరకు రాజు, తన ఖజానాను కొల్లగొట్టుతున్న వాళ్ళను పట్టి ఇచ్చిన వారికి తన కుమార్తెను ఇచ్చి పెళ్ళి చేస్తానని చాటింపు వేశాడు. రాజకుమార్తెను పెళ్ళాడాలన్న ఆశతో అనేకమంది దొంగను పట్టటానికి ప్రయత్నించారు. కాని దొంగ దొరకలేదు, ఖజానాలో దొంగతనాలు ఆగి పోనూలేదు.

ఇలా ఉండగా ఒకనాడు రాజుగారు సభ తీరి ఉండగా ఒక అందమైన యువకుడు రాజుగారిని చూడవచ్చి, ''మహారాజా, మీరు వేసిన చాటింపు విన్నాను. దొంగను పట్టటానికి మీకు నేను సహాయపడగల ననుకుంటాను,'' అన్నాడు.

''నీ వెంట నువు కోరినంతమంది భటులను పంపుతాను. దొంగను పట్టి నాకు అప్పగించి, నా కుమార్తెను వివాహం చేసుకో,'' అన్నాడు రాజు.

''మహారాజా, నాకు ఎవరి సహాయమూ అవసరం లేదు. మీరు స్వయంగా నాతో వస్తే చాలు. తమకు అభ్యంతరం లేక పోతే, నన్ను నమ్మి, నేను చెప్పిన చోటికి నా వెంట బయలుదేరి రండి,'' అన్నాడు ఆ యువకుడు.

రాజు మహా ధైర్యశాలి. ఆయన కొంచెం ఆలోచించి, యువకుడి కేసి పరీక్షగా చూసి, ''సరే, ఎప్పుడు బయలు దేరుదాం?'' అని అడిగాడు.

''ఆ సంగతి మళ్ళీ వచ్చి మనవి చేసుకుంటాను,'' అని యువకుడు వెళ్ళిపోయాడు.

రెండు రోజులు గడిచినాక ఆ యువకుడు ఒక రాత్రి రాజుగారిని కలుసుకుని, ''ఈ రాత్రే మనం మారు వేషాలలో బయలుదేరాలి,'' అన్నాడు.

కొద్దిసేపటికి వారు అరణ్యప్రాంతం చేరుకుని, గుట్టల మధ్యకు వచ్చారు. యువకుడు రాజుతోబాటు ఒక కొండ రాయి చాటున కూర్చున్నాడు. అతను రాజుతో, ''మహారాజా, ఇంకా ఎగువన కొండల్లో ఒక పెద్ద గుహ ఉన్నది. అందులో దొంగలు రాత్రివేళ చేరి, తాగి తందనాలాడతారు. కాని మీకు నేను చూపించదలచిన దృశ్యం అది కాదు,'' అని ఆగి ఆలకించాడు.

దూరాన గజ్జెల చప్పుడు వినవచ్చింది. యువకుడు రాజుతో, ''మహారాజా, ఆ వచ్చేది ఒక యువతి. ఆమెను జాగ్రత్తగా పరిశీలించండి,'' అన్నాడు.

కొద్దిసేపటికి ఆ దారిన ఒక పదహారేళ్ళ అందగత్తె కాళ్ళ గజ్జెలు చప్పుడు చేసుకుంటూ వచ్చింది. ఆమెకు రెండు పక్కలా ఇద్దరు మనుషులు దివిటీలు పట్టుకుని నడుస్తున్నారు. ఆమె వెనకగా మరి ఇద్దరు మనుషులు ధనపుసంచులు భుజాల మీద మోస్తూ వస్తున్నారు. రాజూ, యువకుడూ చూస్తూండగానే అందరూ ముందుకు సాగిపోయారు.





రాజు ఎంతకూ ఏమీ మాట్లాడక పోవటం చూసి యువకుడు, ''మహారాజా, ఏమిటి ఆలోచిస్తున్నారు?'' అని అడిగాడు.

రాజు యువకుణ్ణి, ''ఇక్కడ ఇలా జరుగుతున్నదని నీకు ఎలా తెలిసింది?'' అని అడిగాడు.

యువకుడు రాజుతో, ''మహారాజా, నేను చిన్నప్పటి నుంచీ తల్లిదండ్రుల మాట లక్ష్యపెట్టక, దేనికీ భయపడక, కొండల్లోనూ, కోనల్లోనూ యథేచ్ఛగా తిరుగుతున్నాను. ఒక రోజు రాత్రి నేను చెప్పిన గుహ వద్దకు వచ్చాను. లోపలి నుంచి కోలాహలం వినిపించింది. లోపలికి తొంగి చూశాను. గుహ లోపల దొంగలున్నారు. ఒక పక్క మహాకాళి విగ్రహం ఉన్నది. దానికి కొందరు పూజ చేస్తున్నారు. మరికొందరు తాగుతున్నారు. ఒక ఎత్తయిన రాయి మీద దొంగలనాయకుడు కూర్చుని ఉన్నాడు. ఇప్పుడు మనం చూసిన యువతి ఒక యువకుడి పక్కన కూర్చుని ఉన్నది. ఆమె సమీపంలో ధనపు సంచులున్నాయి. అంత ధనం ఎక్కడి నుంచి వచ్చిందా అని నాకు అనుమానం వేసింది. తమరు వేసిన చాటింపు విన్న మీదట అది మీ ఖజానా ధనమేమోనని నాకు అనుమానం వచ్చింది. అందుచేత ఇవాళ మిమ్మల్ని ఇక్కడికి తెచ్చాను," అన్నాడు.

రాజు యువకుడితో, ''మనం చూసిన పిల్ల ఎవరనుకున్నావు? ఆమె నా కూతురు!'' అన్నాడు.

యువకుడు కంగారుపడుతూ, ''నిజంగానా, మహారాజా? ఈ సంగతి నాకు ఏ మాత్రం తెలిసినా తమర్ని ఇక్కడికి తీసుకు రాకపోదును. ఎంత అన్యాయం జరిగింది! మీరు నన్ను క్షమించాలి!'' అని ప్రాధేయపడ్డాడు.

''వెర్రివాడా, నీ కెందుకు విచారం? నా కూతురైనా, మరొకరైనా న్యాయం జరిగి తీరాలి. రేపు ఆమెను కఠినంగా శిక్షిస్తాను. నువు రేపు రాజభవనానికి రా!''

అని చెప్పి రాజు తన భవనానికి తిరిగి వెళ్ళాడు.

ఆయన తిన్నగా రాజకుమార్తె మందిరానికి వెళ్ళి, అక్కడి పరిచారికలను, ''అమ్మాయి ఎక్కడ?'' అని అడిగాడు. వాళ్ళు కొయ్యబారిపోయారు.

తెల్లవారేదాకా రాజు తన కుమార్తె మందిరంలోనే ఉండి, తెల్లవారు జామున ఆమె రాగానే, ''రాత్రి అంతా ఎక్కడ ఉన్నావు?'' అని అడిగాడు. ఆమె తల వంచుకుని, జవాబు చెప్పలేదు.

మర్నాడు ఉదయం సభలో రాజు, ''రాజకుమార్తెను రాజద్రోహిగా నిర్ణయించాం. ఆమెకు తీవ్రమైన శిక్ష విధిస్తాం,'' అన్నాడు.

ఆ సమయంలో రాజసభలో ఉన్న యువకుడు, ''మహారాజా, మీరు రాజకుమార్తెను దొంగ అని నిర్ణయించే పక్షంలో ఆమెను మీకు పట్టి ఇచ్చినందుకు, చాటింపు ప్రకారం నాకు ఆమెను ఇచ్చి వివాహం చెయ్యవలసి ఉంటుంది,'' అన్నాడు.

రాజు అందుకు ఒప్పుకుని ఆ యువకుడికి తన కుమార్తె నిచ్చి పెళ్ళి చేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, ''రాజా, విక్రమసేనుడు తన కుమార్తెను ఎందుకు శిక్షించలేదు? యువకుడికి చేసిన వాగ్దానం నిజంగా నిలబెట్టుకునేటందుకేనా? లేక, తన కుమార్తెను శిక్షించకుండా ఉండటానికి ఈ వాగ్దానం అడ్డం పెట్టుకునే ఉద్దే



శంతోనే ఆ యువకుణ్ణి మర్నాడు సభకు రమ్మన్నాడా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఇది ఇంత తేలికైన సమస్యకాదు. ఆ యువకుడి ప్రవర్తన మొదటి నుంచి చివరదాకా అనుమానాస్పదంగానే ఉన్నది. అతను తననుగురించి రాజుకు చెప్పుకునేటప్పుడు ఆరితేరిన దొంగకు ఉండవలసిన లక్షణా లన్నీ చెప్పుకున్నాడు. రాజుకు దొంగను పట్టి ఇయ్యటమే అతని ఆశయమైతే, రాజు వద్ద భటులను తీసుకుని రాజ కుమార్తెను గాని, గుహలో ఉన్నారను కున్న దొంగలను గాని తానే పట్టుకుని ఉండవచ్చును. అతను రాజుకు చూపిం చిన దృశ్యం ఒక కృత్రిమ నాటకం లాగున్నది. అందులో దివిటీలు రాజ కుమార్తెను రాజు గుర్తించటానికి తప్ప మరెందుకూ కావు. రాజుకు ఈ దృశ్యం చూపేముందు యువకుడు రెండు రోజులు వ్యవధి ఎందుకు తీసుకున్నాడు? ఈ ప్రదర్శనం ఏర్పాటుకే అయి ఉండాలి. రాజుకు ఇతని మీద అనుమానం ఉన్న దనటానికి సందేహం లేదు. తన కుమార్తె ఎవరో గజదొంగను ప్రేమించిందని తెలిసి ఈ యువకుడు ఆమెను అడగటానికి సాహసిస్తాడో లేదో తెలుసుకునేటందుకే రాజు అతన్ని సభకు రమ్మన్నాడు. యువకుడు రావటమే గాక, ఆమెను పెళ్ళాడటానికి జంకలేదు. అతనే ఆ గజ దొంగ అనీ, రాజకుమార్తె అతన్ని ప్రేమిస్తున్నదనీ రాజుకు స్పష్టమయింది. యువకుడు రాజకుమార్తెను రహస్యంగా ప్రేమించటానికి మారుగా, రాజకుమార్తెనే దొంగగా పట్టి ఇచ్చి, రాజుగారి వాగ్దానం ప్రకారం పెళ్ళాడటానికి మంచి పథకం వేశాడు. అతని తెలివికి రాజు తల ఒగ్గి, వారిద్దరికీ పెళ్ళి చేసేశాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






# ఎత్తుకు పై ఎత్తు

ఒక ఊళ్ళో ఒక చిన్న జమీందారు ఉండేవాడు. అయన చాలా మంచివాడు. అయనకు ఒక్కడే కొడుకు. ఆ కొడుకును జమీందారు ఎంతో ముద్దుగా పెంచి, పెద్ద వాణ్ణి చేశాడు. కాని వాడు అన్నిరకాల చెడు అలవాట్లూ నేర్చుకుని, డబ్బును మంచి నీళ్ళలాగా ఖర్చు చేయసాగాడు.

ఒకసారి జమీందారు కొడుకు పొరుగున ఉన్న ఊరికి వెళ్ళి, అక్కడ తన వద్ద ఉన్న డబ్బంతా ఖర్చు చేసుకున్నాడు. అందుచేత వాడు ఆ వూళ్ళోని ఒక వడ్డీ వ్యాపారి వద్దకు వెళ్ళి అయిదువందల రూపాయలు కావాలనీ, ఇంటికి వెళ్ళగానే వడ్డీతో సహా బాకీడబ్బు పంపేస్తాననీ అన్నాడు.

ఆ వడ్డీ వ్యాపారికి జమీందారు బాగా తెలిసి ఉండటంచేత అప్పు ఇయ్యటానికి నిశ్చయించుకుని, "బాబూ, ఏదైనా తాకట్టు పెట్టుకోకుండా అప్పు ఇయ్యరాదని నాకు నియమం ఉన్నది. మీ వస్తువు ఏదైనా నా వద్ద ఉంచి, డబ్బు తీసుకు వెళ్ళండి," అన్నాడు.

జమీందారు కొడుకు కొంచెం ఆలోచించి, "అయ్యా, ప్రస్తుతం నా వద్ద కైజారు మాత్రం ఉన్నది. దాన్ని మీ వద్ద ఉంచుకుని డబ్బు ఇయ్యండి," అన్నాడు.

వడ్డీవ్యాపారి ఆ కైజారును తీసుకుని అతనికి అయిదువందలూ ఇచ్చేశాడు.

ఒక సంవత్సరం గడిచింది. జమీందారు చచ్చిపోయాడు. జమీందారు కొడుక్కు పెత్తనం వచ్చింది. అతను పొరుగూరి వడ్డీవ్యాపారి బాకీ తీర్చలేదు.

ఆ బాకీ మంచిగా వసూలు కాదనీ, దాన్ని యుక్తిగా వసూలు చేసుకోవాలనీ వడ్డీవ్యాపారి నిర్ణయించుకున్నాడు.

ఖైరి సత్యనారాయణ

వడ్డీవ్యాపారి ఉండే ఊరి చాకలే జమీందారుగారికి బట్టలు ఉతుకుతాడు. వడ్డీవ్యాపారికి కూడా వాడే చాకలి.

ఒకనాడు వడ్డీ వ్యాపారి చాకలికి బట్టలు వేస్తూ, "పోయిన జమీందారు గారి అబ్బాయి తన కైజారు కుదువబెట్టి నా దగ్గిర అప్పుతీసుకున్నాడు. ఆ కైజారు ఏమయిందో కనిపించటం లేదు. రేపు డబ్బు తీసుకువచ్చి కైజారు తెమ్మంటే ఏం చెయ్యాలో నాకు తెలియకుండా ఉంది," అన్నాడు.

ఆ చాకలి మర్నాడే జమీందారు గారింటికి వెళ్ళి జమీందారు కొడుకుతో ఈ సంగతి కాస్తా చెప్పేశాడు.

ఈ మాట విని జమీందారు కొడుకు చాలా సంతోషించాడు. అతను బాకీ అయిదువందలూ, వడ్డీ కింద మరి రెండు వందలూ చేత బుచ్చుకుని, వడ్డీవ్యాపారి ఇంటికి వచ్చాడు.

వ్యాపారి అతనికి కూర్చోవటానికి కుర్చీ వేసి మర్యాద చేశాడు.

"కూర్చునే వ్యవధి లేదు. నేను త్వరగా వెళ్ళాలి. బాకీ తీర్చి కైజారు పట్టుకు పోదామని వచ్చాను," అన్నాడు జమీందారు కొడుకు.

"కైజారా?" అన్నాడు వ్యాపారి తనకు గుర్తేరానట్టు.

"అవును, కైజారే! అది మా తాత తండ్రుల నాటిది. మా గౌరవానికి చిహ్నం. అది గాని పోయిందంటే పదివేల రూపాయలు నీ వద్ద వసూలు చేస్తాను," అన్నాడు జమీందారు కొడుకు.

వ్యాపారి నెమ్మదిగా, "చూస్తాను ఉండండి. మొన్న ఈ మధ్య వెతికితే కనిపించలేదు. అది పారేస్తే, దాని ఖరీదు ఇచ్చుకోక తప్పుతుందా? ఏదీ మీరు తెచ్చిన డబ్బు?" అన్నాడు.

జమీందారు కొడుకు ఏడువందలూ ఎంచి వ్యాపారి చేతికి ఇచ్చాడు. వ్యాపారి లోపలికి వెళ్ళి కైజారు తెచ్చి అతనికి ఇచ్చేశాడు. జమీందారు కొడుకు ముఖం మాడ్చుకుని ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు.



# 156. ప్రకృతి శిల్పం

అర్మేనియాదేశం అద్భుతాలకు ప్రసిద్ధి అని చెబుతారు. ఈ కొండ మీద మనకు కనిపించే శిల్పం మానవుడు కల్పించినది కాదు, ప్రకృతి కలిగించినది. ఇందులో అనేక గుహల లాటివి కూడా ఉన్నాయి. అక్కడక్కడా స్వచ్ఛమైన, తియ్యని నీటిజలలు బయలుదేరుతాయి. ఆ నీటని జలాశయాలలో భద్రపరచి అర్మేనియాలోని నగరాలకు సరఫరా చేస్తూంటారు.





# తప్పుడు సలహాలు

ఒకానొకప్పుడు కోసలదేశాన్ని ఏలిన ప్రచండుడు ప్రజలకు ఏ లోటూ లేకుండా పాలించాడు. ఆయన గుండెపోటువల్ల అర్థాంతరంగా మరణించటంచేత, ఇంకా విద్యాభ్యాసం కొనసాగిస్తున్న ప్రచండుడి కుమారుడు సుకుమారుడు దేశానికి రాజు కావటం జరిగింది.

అన్నిరకాల విద్యలూ ముగించినాకనే రాజనీతి యువరాజుకు నేర్పటం కోసల దేశపు ఆచారం. అందుచేత సుకుమారుడు రాజగురువు వద్ద శిక్షణ పొందక పూర్వమే రాజు అయాడు. అతనికి అన్ని విద్యలూ నేర్పినవాడు సుమతి. సుమతి గొప్ప విద్యావేత్త మాత్రమే కాక గొప్ప తత్వవేత్త కూడానూ. రాజయినప్పుడు సుకుమారుడికి సుమతి కొన్ని సలహాలిచ్చాడు:

''మనిషికి ముఖ్యమైనది మనస్సు. దాన్ని ఎల్లప్పుడూ స్వచ్ఛంగా ఉంచుకోవాలి. తప్పు పనులను గురించి నిత్యమూ ఆలోచిస్తూ, వాటిని చేయకుండా ఉండటం కంటె, ఒకసారి తప్పు చేసి శాశ్వతంగా మనసును శుభ్రం చేసుకోవటం మంచిది.

''ప్రతి మనిషికీ అహం ఉంటుంది. అందువల్ల తానే గొప్పవాడి ననుకుంటాడు. ఎదటివాడి గొప్పతనాన్ని గుర్తించినవాడే నిజంగా గొప్పవాడు. అటువంటి వాళ్ళనే రాజు చేరదీయాలి.

''మనుషులు రెండే రెండు రకాలు- మంచివాళ్ళూ, చెడ్డవాళ్ళూ. దేశంలో చెడ్డవాళ్ళను నశింప జేసి, మంచివాళ్ళు మాత్రమే ఉండేలా చెయ్యడం రాజు కర్తవ్యం.

''మనం ఏది సంకల్పించినా, భగవంతుడి సహకారం లేకపోతే ఏ పనీ జరగదు. భగవంతుడి సహకారం ఉంటే

మనం సంకల్పించని పని కూడా దానంతట అదే జరిగిపోతుంది.''

ఈ సలహాలు విని సుకుమారుడు తనకు రాజనీతి అంతా తెలిసిపోయిందను కున్నాడు. ఒక్క సంవత్సరం లోపల అతను విలాస పురుషుడుగా తయారయాడు. ప్రచండుడి పరిపాలన చూసిన ప్రజలకు ఇతని పరిపాలన చాలా అసంతృప్తి కలిగించింది. వాళ్ళు అనేక రకాల ఇబ్బందులకు గురికాసాగారు.

రెండు సంవత్సరాలు గడిచేసరికి రాజ్య పరిస్థితి అస్తవ్యస్తంగా తయారయింది. కోసలదేశం ఆర్థికంగానూ, సైనికంగానూ కూడా బలహీనమైనదని పుకార్లు బయలుదేరి, పొరుగుదేశపు రాజు కోసలను జయించడానికి సైనిక సన్నాహాలు చేస్తున్నట్టు తెలిసింది.

ఇది విని సుకుమారుడు సుమతి వద్దకు వెళ్ళి, ''గురువర్యా, అన్నీ మీ సలహా ప్రకారమే చేస్తున్నాను. కాని పరిపాలన సక్రమంగా ఉన్నట్లు కనబడదు. నాకు కలవరంగా ఉన్నది,'' అన్నాడు.

''నేను చెప్పినట్లు నువు చెయ్యలేదు, విలాస పురుషుడివైపోయావు,'' అన్నాడు సుమతి విసుగుగా.

''పాపపు ఆలోచనలను మనసులో పెట్టుకోకుండా, ఆచరణలో పెట్టి, వాటి



నుండి మనసుకు విముక్తి కలిగించాలని మీరే కదా చెప్పారు? మద్యపానం నుంచీ, స్త్రీల నుంచీ నా మనసు ఇంకా విముక్తి పొందలేదు,'' అన్నాడు సుకుమారుడు.

ఈ మాట విని సుమతి కంగారు పడ్డాడు. తన సలహా ఇలాటి విపరీతానికి దారి తీస్తుందని ఆయన ఊహించ లేదు. ఏం చెయ్యాలో తోచక ఆయన రాజగురువు కోసం కబురు పెట్టాడు.

ఇంత కాలానికి రాజగురువూ, సుకుమారుడూ కలుసుకున్నారు. రాజగురువు సుమతికి ఏర్పడిన సమస్య గురించి విని, చిన్నగా నవ్వి, ''చూడండి! మీరు సుకు




మారుడికి ఇచ్చిన సలహాలు చాలా గొప్పవే గాని, అవి వేదాంతులకు తప్ప సామాన్యులకు పనికిరావు; ప్రజా పాలన చేయవలసిన యువకుడికి అసలే పనికి రావు," అని సుకుమారుడి కేసి చూసి, "రాజుకు ప్రధానమైనది మనసును శుభ్రంగా ఉంచుకోవడం కాదు, నిదానంగా ఆలోచించడం. విపరీతమైన కోపం వచ్చి నువు ఒక మనిషిని చంపేశా వనుకో. రాజువు కాబట్టి నీకు అడ్డు ఉండదు. ఆ మనిషిని చంపేసి నీ మనసును శుభ్రం చేసుకుంటావు, కాని తర్వాత ఎంత కోరినా ఆ మనిషిని తిరిగి బ్రతికించలేవు. అందుచేత నువు నీ ప్రవర్తనను బాగా అదుపులో పెట్టాలి," అన్నాడు.

రాజగురువు చెప్పిన దానిలోని సత్యం సుకుమారుడికి అర్థమయింది. రాజు కావలిసినవాడికి సలహాలిచ్చే శక్తి తనకు లేదని సుమతి గ్రహించి, క్షమాపణ చెప్పుకుని, వెళ్ళిపోయాడు.

తరవాత రాజగురువు సుకుమారుడితో, "నువు రాజువు, అధికారంలో ఉన్నావు. తెలివైన వాడెవడూ నిన్ను ఎదురుగా తిట్టడు. నీ నుంచి బహుమానం పొందడం కోసం ఎందరో నిన్ను ఇంద్రుడివనీ, చంద్రుడివనీ పొగడుతారు. వాళ్ళంతా నీ గొప్పతనం గ్రహించినవాళ్ళు అనుకుని, చేరదీయడం తెలివితక్కువ. వాళ్ళందరూ రాజభక్తిగలవాళ్ళు కారు. అసలైన రాజభక్తుణ్ణి నీకు చూపిస్తాను. ఈ రాత్రి అతని ఇంటికి మనం మారువేషాలలో వెళ్ళుదాం," అన్నాడు.

ఆ రాత్రి వాళ్ళిద్దరూ మారువేషాలలో ఒక పేద బ్రాహ్మణుడి ఇంటికి వెళ్ళారు. పొరుగూరివారమని చెప్పగానే ఆ బ్రాహ్మణుడు వారికి ఆ రాత్రి తన ఇంట ఆశ్రయంతోబాటు ఆతిథ్యం కూడా ఇచ్చాడు.

మాటల సందర్భంలో రాజగురువు దేశ పరిస్థితిని గురించి ప్రస్తావించాడు.

వెంటనే బ్రాహ్మణుడు ఆవేశపడిపోయి దేశపురాజును నానా మాటలూ అన్నాడు. ఆ బ్రాహ్మణుడు తనను ప్రచండుడి కడుపుచెడబుట్టాడనీ, చేతకానివాడనీ, ప్రజలను నానా కష్టాలూ పెడుతున్నాడనీ నిందిస్తూంటే, సుకుమారుడు ఎంతో కష్టం మీద తన కోపాన్ని అణుచుకున్నాడు.

ఒక రాత్రివేళ రాజగురువూ, సుకుమారుడూ ఆ బ్రాహ్మణుడి ఇంటి నుంచి బయటపడ్డారు.

సుకుమారుడు రాజగురువుతో, "ఈ బ్రాహ్మణుణ్ణి నేను ఎరుగుదును. రోజూ ఆస్థానానికి వస్తాడు. అందరూ నన్ను పొగడి సంభావన తీసుకుపోతారు. ఇతగాడు ఏమీ మాట్లాడడు. అందుచేత ఇతని కేమీ సంభావన ఇవ్వరాదని నేను ఆదేశించాను. ఎందుకో ఇతను నా మీద బాగా కోపం పెంచుకున్నట్టున్నాడు; నోటికి వచ్చినట్లు మాట్లాడాడు. మీరు పక్కన లేకపోతే ఇతన్ని ఏంచేసి ఉందునో!" అన్నాడు.

"రేపు మళ్ళీ మారు వేషాలలో వెళ్ళి, ఏం జరుగుతుందో చూద్దాం," అన్నాడు రాజగురువు.

మర్నాడు వాళ్ళిద్దరూ మళ్ళీ రాగానే ఆ బ్రాహ్మణుడు, వారికి మర్యాద చేసి, "అర్ధరాత్రి వేళ వెళ్ళిపోయారు. కారణం ఏమిటి? నా ఆతిథ్యంలో లోపమేమైనా జరగలేదుగదా?" అని అడిగాడు.





వెంటనే రాజగురువు ఆ బ్రాహ్మణుడికి సుకుమారుణ్ణి పరిచయం చేస్తూ, "ఇతను ఈ దేశానికి ప్రభువు. తనను అన్ని మాట లన్నవాడి ఇంట నిద్ర పట్టక, వెళ్లి పోదా మన్నాడు," అన్నాడు. సుకుమారుడు మారువేషం తొలగించాడు.

బ్రాహ్మణుడు కంగారుగా లేచి నిలబడి, "తమరు ప్రభువులని తెలియక నిన్న అన్ని మాట లన్నాను. నన్ను మన్నించాలి. పేద బ్రాహ్మణ్ణి. మర్యాద లన్నా సరిగా చేయలేక పోయాను," అన్నాడు, రాజుకు ఒక ఆసనం వేస్తూ.

రాజగురువు నవ్వి, "ఎందుకయ్యా, వెర్రి బ్రాహ్మణుడా? నువు ఎన్ని మర్యాదలు చేసినా రాజు మనసు మారదు. నువు ఎలాగూ శిక్ష అనుభవించవలసి ఉంటుంది," అన్నాడు.

బ్రాహ్మణుడు తొణకక, "శిక్షకు భయపడి నే నీ మర్యాద చెయ్యటం లేదు. నా దేశాన్ని ఏలే రాజంటే వ్యక్తిగతంగా నేను ఇష్టపడక పోవచ్చు. కాని ఆ స్థానాన్ని నేను ఎప్పుడూ గౌరవిస్తాను. ఆయన ఎన్ని తప్పులు చేసినా ఆ స్థానంలో ఉన్నంత కాలమూ నేను ఆయనను గౌరవిస్తాను. నా దేశపు రాజుకు అమర్యాద చేయడం నన్ను నేను కించపరచుకోవడమే! ఆయనలో మార్పు రావాలని కోరుతూ, ఆయనను ఆశీర్వదించడానికి నేను రోజూ ఆస్థానానికి వెళ్లుతాను. అయితే ఆయనలో లేని గుణాలు ఉన్నట్టుగా పొగడను. అందుకే నాకు సంభావన కూడా ముట్టదు. అయినా తరతరాలుగా వస్తున్న ఈ వంశాచారం నేను వదలటం లేదు," అన్నాడు.

ఈ మాటలతో సుకుమారుడికి కనువిప్పు కలిగింది.

అక్కడి నుంచి బయటపడ్డాక రాజగురువు, "అసలైన రాజభక్తుణ్ణి చూశావు గదా! అలాటి వాడు పొగడినప్పుడే నువు సంతోషపడాలి. మిగిలిన వాళ్ల పొగడ్తలు ఉత్త మాటలే," అన్నాడు.

తరవాత రాజగురువు సుకుమారుడితో, మనిషి మంచివాడైనా, చెడ్డవాడైనా, ప్రతి వాడి నుంచీ నేర్చుకోవలిసినది ఉంటుం దనీ, రాజు అందరి నుంచీ నేర్చుకోవటా నికి ప్రయత్నించాలనీ అన్నాడు.

ఈ మాట సుకుమారుడికి అసం దర్భంగా తోచి, "మన కారాగారంలో ఎందరో నేరస్థులున్నారు. అటువంటి వాళ్ల దగ్గిర నేను ఏం నేర్చుకోవలసి ఉంటుంది?" అన్నాడు.

మర్నాడు రాజగురువు అతన్ని కారా గారానికి తీసుకుపోయాడు. అక్కడ ఉన్న నేరస్థులలో ఒకడు గుర్రాల దొంగ. అతి లాఘవంగా ఏ గుర్రాన్నయినా లొంగ దీసుకుని, క్షణాలమీద మాయమైపోతాడు.

"ఇతడి వద్ద గుర్రాల దొంగతనం నేర్చుకోవలసి ఉంటుందా?" అని సుకుమా రుడు వెటకారంగా అడిగాడు.

"కాదు, కాని ఎంత కొత్త గుర్రాన్ని అయినా ఎలా లొంగదీసుకోవాలో నేర్చు కోవాలి; క్షణాల మీద మాయం కాగల గుర్రపుస్వారీ నైపుణ్యం నేర్చుకోవాలి," అన్నాడు రాజగురువు గంభీరంగా.

అలాగే, ఎన్నో సార్లు రాజుగారి కోశా గారంలో జొరబడి డబ్బు కాజేసిన దొంగ దగ్గిర, పటిష్ఠమైన కాపలా వున్న భవనా లలో ప్రవేశించే విద్య నేర్చుకోవాలని రాజగురువు అన్నాడు. అలాగే అయన ప్రతి నేరస్థుడి నుంచీ నేర్చుకోవలిసినది ఏదో ఒకటి ఉన్నదని చెబుతూ వచ్చాడు.



అఖరుకు ఒక నేరస్థుణ్ణి చూపుతూ కారాగారాధికారి, "ఇతణ్ణి అసహ్యించుకోని వాళ్లు లేరు. తనకు మేలు చేసిన వారికి కూడా కీడు చేస్తాడు. కృతజ్ఞత అనేది ఏ కోశానా లేదు. ఏ క్షణాన ఏది తోస్తే అది చేసేస్తాడు. ఇతని మూలాన ఎందరో స్త్రీలు మానం కోల్పోయారు, ఎందరో మనుషులు ప్రాణాలు కోల్పోయారు," అన్నాడు.

"ఇలాటి వాడి వద్ద నేర్చుకోవసినది ఏముంటుంది?" అని సుకుమారుడు అడిగాడు.

"మనిషి ఎలా ప్రవర్తించ కూడదో ఇతడి నుంచి నేర్చుకోవచ్చు," అన్నాడు రాజగురువు.

వెంటనే సుకుమారుడు చేతులు జోడించి, "మీరు చెప్పిన వన్నీ అక్షరాలా నిజం," అన్నాడు.

"ఇంకా అయిపోలేదు. ఈ నేరస్థులందరికీ ఈ కాపలా ఎందుకు?" అని రాజగురువు అడిగాడు.

"వీళ్లు తప్పించుకు పోతే ప్రజలకు అపాయం గదా, అందుకని!" అన్నాడు సుకుమారుడు.

"మనం ఏం చేద్దామన్నా భగవంతుడి సహకారం అవసరం కదా! మంచి పనికి భగవంతుడి సహకారం ఉంటుంది గదా! నేరస్థులను కాపలా కాసే భారం భగవంతుడి మీద వెయ్యక, మనుషుల మీద ఎందు కుంచావు?" అని రాజగురువు అడిగాడు.

ఇది కఠినమైన ప్రశ్నగాతోచి సుకుమారుడు జవాబు చెప్పలేదు.

"అంటే, మన ప్రయత్నం లేకుండా భగవంతుడి సహకారం లభించ దన్న మాట! అంతేనా?" అని రాజగురువు అడిగాడు.

తరవాత సుకుమారుడు రాజగురువు వద్ద ఎన్నో విషయాలు తెలుసుకుని, రాజనీతి అలవరుచుకుని, తండ్రిని మించిన కొడుకు అనిపించుకునే లాగా రాజ్యం చేశాడు.





చందనపుర రాజు సుమంతుడికి అరవిందభట్టు అనే మంత్రి ఉండేవాడు. చందనపురం పరిసరాలలో ఏనుగులు విస్తారంగా ఉండేవి. అందుచేత ఆ దేశంలో గుర్రాల కన్న ఏనుగులు ఎక్కువగా ఉండేవి. అదేవిధంగా శమంతిని అనే రాజ్యంలో ఏనుగుల కన్న గుర్రాలు ఎక్కువగా ఉండేవి.

అందుచేత శమంతుడు తన మంత్రిని పిలిచి, "మీరు శమంతినికి వెళ్ళి, రాజదర్శనం చేసుకొని, మన ఏనుగులను తీసుకుని వారి గుర్రాలను ఇస్తారేమో కనుక్కొరండి," అన్నాడు.

అరవిందభట్టు ఒక సేవకుణ్ణి వెంటబెట్టుకుని శమంతినికి వెళ్ళి, రాజుతో మాట్లాడి, గుర్రాలనిచ్చి ఏనుగులను తీసుకోవటానికి ఒప్పించాడు. శమంతిని రాజువద్ద మంత్రి అయిన ఆదిభట్టు అరవిందభట్టును ఒక రోజు తన ఇంట అతిథిగా ఉండమని కోరాడు.

భోజనాలు పూర్తిచేసి ఇద్దరు మంత్రులూ కబుర్లు చెప్పుకునేటప్పుడు, ఆదిభట్టు అరవిందభట్టుతో, "మా రాజు నా చేతిలో కీలు బొమ్మ. నేను నంది అంటే తను నంది అంటాడు, నేను పంది అంటే తను కూడా పంది అంటాడు;" అన్నాడు.

అరవిందభట్టు ఈ మాట నమ్మలేకపోయాడు.

"ఈ మాట మీరు స్వయంగానే తెలుసుకోవచ్చు. ఈ సాయంకాలం నేనూ, రాజూ ఫలానివైపు వాహ్యాళి పోతాం. అప్పుడు మీరు ఎక్కడనైనా పొంచి ఉండి, ఏం జరిగేదీ చూడండి." అన్నాడు ఆదిభట్టు.

అరవిందభట్టు తన సేవకుడితో సహా ఊరిబయటకు వెళ్ళి, ఒక పెద్ద చెట్టు చాటున దాక్కున్నాడు.

టి. మనోహర్




తరవాత కొంత సేపటికి గుర్రాలెక్కి, ముందు మంత్రీ, వెనకగా రాజూ వచ్చారు. ఆదిభట్టు దారిలో గుర్రాన్ని ఆపి, రాజుకు ఒక జొన్నచేను చూపి, "ఈ చెరుకు చేను చూడండి. గడలు ఎంతలావుగా ఉన్నాయో!" అన్నాడు.

రాజు, "అవునవును! చెరుకు గడలు చాలా లావుగా ఉన్నాయి!" అన్నాడు.

అంతలో మంత్రి అటుగా వెళుతున్న ఒక పసిరికపామును చూసి, "చూశారా, మహారాజా, ఆ కొండచిలువ ఎంత లావో, ఎంత పొడుగో!" అన్నాడు.

"అవును. అంత పెద్ద కొండ చిలువను నే నెన్నడూ చూడలేదు!" అన్నాడు రాజు. ఇద్దరూ ముందుకు సాగిపోయారు.

ఇదంతా చాటునుంచి వింటున్న అరవిందభట్టూ, అతని సేవకుడూ చాలా ఆశ్చర్యపోయారు. అరవిందభట్టు ఆదిభట్టు ఇంటికి చేరుకుని, అతనికన్న తాను మరీ గొప్ప మంత్రినని రుజువుచేయ నిశ్చయించాడు.

ఆదిభట్టు ఇంటికి తిరిగి వచ్చి, అరవిందభట్టుతో, "చూశావా, నా గొప్ప?" అన్నాడు.

అరవిందభట్టు నిర్లక్ష్యంగా, "ఏమైనా నువు నా కన్న గొప్పవాడివి కాదులే. నాకు తిక్కరేగిందంటే మా రాజును నానా తిట్లూ తిడతాను. అన్నీపడి ఊరుకుంటాడు. నా వెంటరా! ప్రత్యక్షంగా చూపిస్తాను," అన్నాడు.

ఇద్దరూ చందనపురం చేరుకున్నారు.

"నేను రాజుతో మాట్లాడబోతున్నాను. నువు తెరచాటున ఉండి ఏం మాట్లాడతానో విను," అన్నాడు అరవిందభట్టు. అతను ఆదిభట్టును ఒక తెరచాటున కూర్చోబెట్టాడు. తెర అవతల రాజు కూర్చున్న చోటికి అరవిందభట్టు వెళ్లాడు.

"ఏం, మంత్రీ? మీరు వెళ్ళినపని ఏమయింది?" అని రాజు అరవిందభట్టును అడిగాడు.

దానికి అరవిందభట్టు, "పనిసాను కూలమయింది. కాని ఈ ప్రయాణంతో నా శరీరమంతా హూనం అయింది. నీ చచ్చుసలహాలు విని ఎండల్లో బయలు దేరటం నాదే బుద్ధి తక్కువ. నీకు ఏళ్ళు వచ్చాయి గాని, బుద్ధి ఏమాత్రమూ రాలేదు," అన్నాడు.

ఇంతమాట పడి రాజు తల ఆడించి చిరునవ్వు నవ్వటం ఆదిభట్టు తెరచాటు నుంచి చూసి, మూర్ఛపోయినంత పని చేశాడు.

అరవిందభట్టు ఇవతలికి వచ్చి ఆదిభట్టుతో, "నేను నీకన్న కాస్త గొప్పవాడినని ఒప్పుకుంటావా?" అన్నాడు.

"అందుకు సందేహమా?" అన్నాడు, ఆదిభట్టు.

ఇంతలో అరవిందభట్టు సేవకుడు వచ్చి, తన యజమానిని అవతలికి తీసుకుపోయి, "అయ్యా, శమంతిని రాజుకు కళ్ళు సరిగా కనబడవుట. వారి మంత్రిగారి సేవకుడు చెబుతున్నాడు. అందుచేతనేమో ఆయనగారు జొన్న చేను చూసి చెరుకు చేననీ, పసిరిక పామును చూసి కొండచిలువ అనీ అనుకున్నాడు," అన్నాడు.

ఈ లోపల ఆదిభట్టు సేవకుడు వచ్చి ఆదిభట్టును మరొకవైపుకు తీసుకుపోయి, "అయ్యా, ఈ సంగతి వినండి. ఈ దేశపు రాజుకు బ్రహ్మ చెవుడుట. వారి మంత్రిగారి సేవకుడు నాకు చెప్పాడు," అన్నాడు.

ఇద్దరు మంత్రులకూ మోసపోయినందుకు ఆగ్రహావేశం వచ్చేసింది. అరవిందభట్టు శమంతిని దేశపురాజుకు ఒక లేఖరాస్తూ, ఆదిభట్టు చేసినదంతా అందులో వివరించాడు. అదేవిధంగా ఆదిభట్టు అరవిందభట్టు అన్నమాటలన్నిటినీ వివరిస్తూ శమంతుడికి ఒక లేఖ పంపాడు.

ఈ లేఖలఫలితంగా అరవిందభట్టుకూ, ఆదిభట్టుకూ మంత్రిపదవులు ఊడటమే గాక, దేశబహిష్కరణ కూడా జరిగింది.



# మామూలు!

ఒక ఊళ్ళో చంద్రయ్య అనే పేద కాపు ఉండేవాడు. అతను కాయకష్టం చేసుకొని బ్రతికేవాడు.

ఒకసారి చంద్రయ్య తనకుండే గుడిసె ప్రక్కన రెండు పుచ్చపాదులు వేశాడు. అవి క్రమంగా పెరిగి పెద్దవై తొమ్మిది మంచి పుచ్చకాయలు కాశాయి. వాటి నమ్మి గొంగళి కొందామనుకొని కోసి, ఒక పాత దుప్పటిలో చుట్ట బెట్టుకొని ప్రక్క పట్టణంలో జరిగే సంతకు తీసుకెళ్ళాడు.

సంతలో కావలివాడు తన మామూలని చంద్రయ్య వద్ద నుంచి ఒక పుచ్చకాయ తీసుకొన్నాడు. అలాగే ప్రభుత్వోద్యోగి, మేనేజరూ యిలా తలా వకరూ తమ తమ మామూళ్ళని అతన్ని బెదిరించి కాయల్ని లాక్కొన్నారు.

పాపమా పేద కాపు దగ్గరలో ఉన్న పై అధికారి వద్దకు వెళ్ళి తనకు జరిగిన అన్యాయాన్ని గురించి ఫిర్యాదు చేశాడు. దాని కాయన మండిపడి, "నీచుడా! ఇంతమంది వెధవలకు మామూళ్ళిచ్చి నా దగ్గరకు ఉత్త చేతుల్తో వస్తావా? ఆ దుప్పటి ఇక్కడ పెట్టి వెళ్ళరా?" అని గర్జించాడు.

చేసేదేమీలేక తనకు మిగిలిన పాత దుప్పటిని అక్కడ వుంచి, దుఃఖంతో తన నివాసాని కేసి బయలుదేరాడు పాపం చంద్రయ్య.

—కె. వి. నాగేశ్వరరావు





# కేశవతి తలకట్టు

సోనాపూరు రాజకుమార్తె కేశవతి చాలా చక్కనిది. పన్నెండేళ్ల వయసు గల కేశవతిలో అన్నిటినీ మించిన ఆకర్షణ ఆమె తలకట్టు. ఆమె వెంట్రుకలు ఒత్తుగానూ, అమిత నల్లగానూ, చాలా పొడవుగానూ ఉండేవి. అందుచేత ఆమె తలకట్టు గురించి రాజ్యమంతటా విడ్డూరంగా చెప్పుకునేవారు.

ఒక్కతే బిడ్డ కావటంచేత రాజదంపతులు కేశవతిని ఎంతో శ్రద్ధగా పెంచేవారు. అందులోనూ రాణి తన కుమార్తెకు తల దువ్వటమూ, కేశాలంకరణ చెయ్యటమూ మొదలైన పనులను దాసీలకు అప్పగించక, తానే స్వయంగా చేసేది. ఆమె కేశవతి జుట్టుకు స్వచ్ఛమైన కొబ్బరినూనె మాత్రమే వాడేది.

ఒకనాడు కేశవతి నూనె గానుగకు వెళ్లి, ఎద్దులు గానుగను తిప్పటమూ, కొబ్బరి ఆ గానుగలో నలగటమూ, గానుగ దిగువ నుంచి నూనె పిడతలోకి బొట్లు బొట్లుగా పడుతూ ఉండటమూ చూసింది. ఇదంతా చూస్తూ ఉంటే ఆమెకు నూనె మీద రోత పుట్టింది. ఇంతలో ఆ గానుగ మీదికి పాకి వచ్చిన బల్లి ఒకటి గానుగలో జారి పడింది. అది చూసి కేశవతి కెవ్వున అరిచి, మూర్ఛపోయింది.

అటు తరవాత ఆమెకు నూనె పైన చెప్పరాని అసహ్యం పుట్టుకొచ్చింది. ఆమె కొబ్బరినూనెను తలకు రాచుకోవటానికి ఎంత మాత్రమూ ఒప్పుకోలేదు. తల్లి ఎన్నో విధాల చెప్పి చూసింది, తండ్రీ చెప్పి చూశాడు. కాని ప్రయోజనం లేకపోయింది. పోనీ, ఇంకేదైనా నూనె రాచుకోమన్నారు. కాని ఆమెకు అన్ని నూనెల మీదా రోత పుట్టింది. ఆమె జుట్టు

కళాహీనమై పోయి, నిగనిగలాడటం మానేసింది.

''నువు కొంచెం కూడా గ్రహించకుండా ఉన్నావు, తల్లీ,'' అన్నది తల్లి.

''అంతా గ్రహించాను. నేను నూనె రాచుకోను,'' అన్నది కేశవతి.

''నూనె రాయకపోతే జుట్టు ఎలా పెరుగుతుంది?'' అన్నది రాణి.

కేశవతి ఒక మొక్కకు నీరు బదులు నూనె పొయ్యనారంభించింది. త్వరలోనే ఆ మొక్క కాస్తా చచ్చింది.

''చూశావా, అమ్మా? పెరగటానికీ నూనెకూ ఏమీ సంబంధం లేదు,'' అన్నది కేశవతి తల్లితో. రాణి ఇంకేం మాట్లాడుతుంది?

ఆస్థానవైద్యులు వచ్చి, ఆయుర్వేదంలో నుంచి శ్లోకాలు చదివి, జుట్టుకు నూనె కావాలన్నారు. కాని కేశవతి నిర్ణయాన్ని మార్చటం వాళ్లకు సాధ్యం కాలేదు.

ఈ వార్త త్వరలోనే రజతపురానికి చేరింది. రజతపురం సోనాపురానికి పొరుగున ఉన్నది. ఇద్దరు రాజులూ మిత్రులు. కేశవతిని రజతపుర రాజకుమారుడు కాంచనుడికి ఇచ్చి పెళ్లి చెయ్యాలని ఏనాడో నిర్ణయం కూడా జరిగింది.

ఇప్పుడు కాంచనుడు పద్దెనిమిదేళ్ల యువకుడు, అనేక విద్యలలో ఆరితేరాడు. తన కాబోయే భార్య గురించి విని, అతను ఆమె మనసు మార్చేటందుకు తాను



కూడా ప్రయత్నం చేయ నిశ్చయించి, సోనాపుర రాజుకు కబురు పంపాడు. అతన్ని అవశ్యం రమ్మన్నారు.

కాంచనుడు వస్తున్నట్టు విని కేశవతి చాలా సంతోషించింది. చిన్నతనంలో అతను తరుచుగా వస్తూండేవాడు; ఇద్దరూ కలిసి సరదాగా ఆడుకునేవారు. ఇద్దరికీ వయసు వస్తున్న కొద్దీ వాళ్ల మధ్య చనువు తగ్గింది.

కాంచనుడు వచ్చాడు. అతను కేశవతితో కొత్తరకం వాదన ప్రారంభించి చూశాడు. ''మెదడు చురుకుగా పనిచెయ్యాటానికి నూనె ఎంత అవసరమో నీకు తెలీదా, కేశవతీ? అది మెదడుకు ఇంధనం!'' అన్నాడు అతను.

''ఇలాంటి మాటలు చాలావిన్నాను, నేను నమ్మను. హరిశాస్త్రిపంతులు గారిది బట్టతల. ఆయన అసలు నూనే రాచుకోడు,'' అన్నది కేశవతి.

''ఇప్పుడు వాడకపోతేనేం? చిన్నప్పుడు ఆయన తప్పక నూనె వాడి ఉంటాడు,'' అన్నాడు కాంచనుడు.

''అందుకే ఆయనకు బట్ట తల అయింది,'' అన్నది కేశవతి తడువుకోకుండా.

''అతి చిన్న ప్రాణులైనా, చీమలు ఎంతో తెలివితేటలు గలవి. ఒక్క నూనె చుక్క కనిపిస్తే చాలు, ఎన్నో చీమలు దాని దగ్గిర చేరి నూనె తాగేస్తాయి,'' అన్నాడు కాంచనుడు.





"అవును, చాలాసార్లు చూశాను. చక్కెర కోసం చీమలు మూగటం కూడా నేను చాలాసార్లు చూశాను. అందుచేత, నన్ను తలకు చక్కెరపాకం రాచుకుని, తెలివి పెంచుకోమంటావా?" అన్నది కేశవతి తాపీగా.

ఇక మాటలతో పని కాదనీ, ఇంద్ర జాలం ప్రయోగించవలసిందేననీ నిర్ణ యించుకుని, కాంచనుడు, "మన చిన్న తనపు రోజులు ఎంత సరదాగా ఉండేవి! నీకు జ్ఞాపకం ఉందా, కేశవతీ?" అని అడిగాడు.

"లేకేం! ఒకటే ఆటలు, ఒకటే సరదా!" అన్నది కేశవతి.

"వెధవ నూనె కేంగాని, మళ్ళీ అలాటి ఆటలు ఆడుకుందామా?" అని కాంచ నుడు అడిగాడు.

"ఈ వయసులోనా? నీకేమైనా పిచ్చా?" అన్నది కేశవతి.

"నువు ఆడవద్దులే. నేను ఆడితే నువు చూడటానికేం?" అన్నాడు కాంచనుడు.

"ఓ, తప్పక చూస్తాను. వెనకటిలాగా నీ ఇంద్రజాలం చూపించు," అన్నది కేశవతి.

"నీకు ఒక కొత్త ఇంద్రజాలం చూపిస్తాను. కాని, ఒక షరతు—అది నీకు నచ్చినట్టయితే, నేను చెయ్యమన్న పని ఒకటి చెయ్యాలి. చేస్తావా?" అని కాంచనుడు అడిగాడు.

"చేస్తాను," అన్నది కేశవతి.

మర్నాడు ఉదయం కాంచనుడు రాజునూ, రాణీనీ, మంత్రులనూ వెంట బెట్టుకుని, ఇంద్రజాలం చూపటానికి కేశవతి మందిరానికి వచ్చాడు. అతను బల్ల మీద ఒక విశాలమైన నీటి తొట్టెను ఉంచాడు. తరవాత అతను ఒక మంద మైన అట్టముక్క నుంచి ఒక చేప ఆకా రాన్ని కత్తిరించాడు. ఆ చేప ఆకారం నిడివి మూడు అంగుళాలూ, వెడల్పు అంగుళమున్నరా ఉన్నది. ఆ చేప

నడుమ ఒక రంధ్రమూ, దాని వెంట ఒక చీలికా ఉండేటట్టు కత్తిరించాడు. ఈ చేప ఆకారాన్ని రాజుకూ, రాణీకీ, కేశవతికీ చూడమని ఇచ్చి, దానిని తొట్టెలోని నీటి మీద తేల్చి, "కేశవతీ, ఈ చేప బొమ్మను చేత్తో తొయ్యకుండానూ, దాని మీద ఊదకుండానూ, ఈదే లాగా చెయ్యగలవా?" అని అడిగాడు.

కేశవతి ముందుకు వచ్చి, చాలా సేపు చేప కేసి పరీక్షగా చూసి, తన వల్ల కాదన్నది.

"నేను చేసేది నీకు నచ్చితే, నేను కోరినట్టు చేస్తానని మాటయిచ్చావు. అది గుర్తున్నది గదా?" అని కాంచనుడు అడిగాడు.

"గుర్తున్నది. నువు నీ ఇంద్రజాలం చెయ్యి," అన్నది కేశవతి.

కాంచనుడు పెద్ద సీసా పైకి తీసి, దానినుంచి ఒక చుక్క ద్రవం చేప మధ్య ఉన్న రంధ్రంలో వేశాడు. చేప దానంతట అదే తొట్టెలో అటూ ఇటూ తిరగ నారంభించింది. అందరూ ఎంతో ఆనందించారు.

కేశవతి ఆనందంతో చిరునవ్వు నవ్వుతూ, "అయితే, ఇప్పుడు నేను ఏం చెయ్యాలంటావు?" అని కాంచనుణ్ణి అడిగింది.

"ఈ సీసాలో ఉన్న అద్భుత ద్రవం మహిమవల్లనే చేప ఈదింది. నేను నిన్ను కోరేదేమంటే, ఈ అద్భుత ద్రవాన్ని నిత్యమూ నువు తలకు పూసుకోవాలి. ఈ సీసా అయిపోగానే మరొక సీసా పంపిస్తాను. సరేనా?" అన్నాడు కాంచనుడు.

"అలాగే పూసుకుంటాను," అన్నది కేశవతి.

రాజూ, రాణీ నవ్వుతూ ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. ఆ సీసాలోది సువాసన చేర్చిన కొబ్బరినూనె అని వారికి తెలుసు. ఆ కొబ్బరినూనె చుక్కే కాగితం చేపను అలా కదిలేటట్టు చేసింది.





# యథా రాజా తథా ప్రజా

పూర్వం విజయపురిని పాలించిన విక్రమసింహుడు పరిపాలించటంలో సమర్థుడు. ఆయన వద్ద తెలివిగల మంత్రు లుండే వాళ్ళు. ఆయన రాజ్యం సుఖశాంతులలో ఓలలాడేది.

ఒకసారి రాజు తన రాజ్యంలో పర్యటన చేస్తూండగా ఒక మారుమూల గ్రామంలో అతి ప్రాచీనమైన సోమనాథదేవాలయం కనిపించింది. అనేక శతాబ్దాల క్రితం ఉచ్చదశలో ఉండిన ఆ దేవాలయం ఇప్పుడు శిథిలమై ఉన్నది.

ఆ దేవాలయాన్ని ఆ స్థితిలో చూసేసరికి రాజుకు ఎక్కడలేని విచారం కలిగింది. ఆ ఆలయాన్ని ఏ విధంగానైనా పునరుద్ధరించి, పూర్వపు ఖ్యాతిని తీసుకురావాలని రాజు నిర్ణయించాడు.

ఈ విషయమై ఆయన మంత్రులతో ఆలోచిస్తే, దానికి చాలా ఖర్చు అవుతుందని వాళ్ళు అన్నారు. ఆలయాన్ని పునరుద్ధరించటమే గాక, దానికింద మాన్యం ఏర్పాటు చెయ్యాలి. ఆ గ్రామాన్ని అభివృద్ధి చెయ్యాలి. యాత్రికుల సౌకర్యం కొరకు అనేక సదుపాయాలు చెయ్యాలి. ఆలయానికి ఖ్యాతి వచ్చేదాకా, దాన్ని రాజధనంతోనే పోషించాలి.

"ప్రస్తుతం మన కోశంలో అంత ధనం లేదు, మహారాజా. కొన్నాళ్ళు వాయిదా వేద్దాం," అన్నారు మంత్రులు.

"అనుకున్నప్పుడు చెయ్యకపోతే ఆ ఆలయాన్ని పునరుద్ధరించటం ఎన్నటికీ జరగదు. ఈ ఖర్చుకోసం కొత్తపన్ను ఒకటి వేద్దాం. దాన్ని ధనికుల మీదా, వర్తకుల మీదా మాత్రమే వేస్తే, వాళ్ళు ఇచ్చుకునే స్థితిలో ఉంటారు. సామాన్య ప్రజలను మనం బాధించ నవసరం లేదు," అన్నాడు రాజు.

గంగిశెట్టి శివకుమార్

మంత్రులు ఈ ఆలోచన బాగున్నదని, మర్నాడే కొత్త పన్ను గురించి చాటింపు వేయించారు.

ఏదైనా కొత్త శాసనం ప్రకటించినప్పుడు రాజు మారువేషంలో నగరమంతా తిరిగి, ప్రజలు ఏమనుకుంటున్నారో తెలుసుకునేవాడు. ఆ ప్రకారం ఆయన చాటింపు జరిగిన మర్నాడు మారువేషంలో వీధులవెంట తిరగసాగాడు.

మధ్యానంవేళ ఒక దుకాణం ముందు నిలబడి ఒక యువకుడు దుకాణదారుతో ఘర్షణపడుతూ ఉండటం రాజుకు కనిపించింది. ఆ యువకుడి మాటలను బట్టి అతను ఒక ధనికుడి వద్ద పని చేస్తున్నాడనీ, కొత్త పన్ను వచ్చి పడినకారణ చేత ఆ ధనికుడు యువకుడి జీతం తగ్గించాడనీ, ఆ యువకుడు అసలే రాబడి తగ్గి బాధపడుతూంటే, అతను ఇంటికి కొనవలసిన సరుకుల ధరలను వర్తకులు పెంచారనీ రాజుకు అర్థమయింది. రాజు చూస్తూండగానే ఆ యువకుడు తనకు కావలిసిన సరుకులు సగం, సగం మాత్రమే కొని వెళ్ళిపోయాడు.

రాజు అనుకున్నది తారుమారు అయింది. తాను ధనికుల మీదనే పన్ను వేశానని ఆయన అనుకున్నాడు. కాని పన్నుల భారాన్ని ధనికులు మోయక, సామాన్య ప్రజల మీదికే తోసేశారు!

రాజు తన ఇంటికి తిరిగి వెళ్ళి మంత్రులతో, "కొత్త పన్ను వెయ్యటం లేదని



మళ్ళీ చాటింపు వెయ్యండి. ధరలు పెంచిన వారిని కఠినంగా శిక్షిస్తామని ప్రకటించండి,'' అన్నాడు.

ఆయన తన మంత్రులకు తాను చూసిన విషయం చెప్పాడు.

''అలా అయితే ఆలయం పునరుద్ధరించే ప్రయత్నం మానుకున్నట్టేనా?'' అని మంత్రులు రాజును అడిగారు.

''లేదు, లేదు! ఆలయం పని ఎన్నటికీ మానను. అందుకు అయే ఖర్చు నేనే భరిస్తాను. ఎలాగంటారా? రాజభవనంలో నిత్యమూ అంతులేని వృథా ఖర్చు జరుగుతున్నది. వేట కిందా, వినోదాల కిందా అంతులేని డబ్బు ఖర్చయి పోతున్నది. రాజకుటుంబం సామాన్య ప్రజలలాగా జీవించినట్టయితే దేవాలయాన్ని బాగు చెయ్యటం సాధ్యమవుతుంది. ఆలయం పని పూర్తి అయేదాకానైనా ఈ దీక్ష కొనసాగిస్తాను,'' అన్నాడు రాజు.

మంత్రులు ఈ మాట విని నిర్ఘాంతపోయి, ''మహారాజా, నేము కూడా విందులూ, వినోదాలూ మాని, మా ఖర్చు తగ్గించి, దేవాలయానికి తోడ్పడతాం,'' అన్నారు.

ఈ మాట విని రాజు సంతోషించాడు. మంత్రులు తామై తమ జీతాలలో హెచ్చు భాగం దేవాలయ నిధి కింద ఇచ్చేశారు. రాజోద్యోగులందరూ ఇలాగే చేశారు. ఈ వార్త నగరమంతా పాక్కిపోయింది. ప్రజలు నగరపు వీధులన్నిటిలోనూ హుండీలు ఏర్పాటు చేశారు. అందులో డబ్బు పడసాగింది.

ఇదంతా చూసి వర్తకులకూ, ధనికులకూ ఎంతో సిగ్గయింది. వాళ్ళు తమలో తాము పోటీ పడి దేవాలయనిధికి పెద్ద పెద్ద మొత్తాలు విరాళాలు ఇచ్చారు.

ఈ విధంగా అంతులేని ధనం పోగయింది. సోమనాథదేవాలయం పూర్వం కన్న గొప్పగా తయారయింది. దేవస్థానానికి అవసరమైన హంగులన్నీ ఏర్పడ్డాయి. త్వరలోనే అది ప్రసిద్ధమైన యాత్రాస్థలంగా మారిపోయింది.





# పురాణశ్రవణం

ఒక ఊళ్ళో ఒక దొంగ ఉండేవాడు. అతను చనిపోతూ, తన నలుగురు కొడుకులనూ పిలిచి, "మీరు దేవాలయాల వైపుకు పోకండి. పురాణాలూ మొదలైనవి వినకండి," అని సలహా ఇచ్చాడు.

ఒక రోజు వాళ్ళు రాజుగారి కోటలో దొంగతనం చెయ్యటానికి బయలుదేరుతూ, దారిలో ఎక్కడన్నా పురాణ పఠనం వినబడుతుందేమోనని చెవులలో దూది పెట్టుకున్నారు. వాళ్ళు కోట కేసి పోతూండగా ఒకడి చెవిలో దూది జారిపడిపోయింది. అదేసమయంలో, సమీపంలో ఉన్న దేవాలయంలో పురాణం చెప్పే అయన ఇలా అంటున్నాడు: "దేవతలు గాని, దయ్యాలుగాని ఈ మన లోకంలోకి వచ్చినప్పుడు వాళ్ళ పాదాలు భూమి మీద ఆనవు. వాళ్ళ నీడలు భూమి మీద పడవు."

ఈ మాటలు విన్న దొంగ పిడుగుపడ్డట్టు వణికిపోయి, చెవులలో మళ్ళీ దూది కుక్కుకుని, ముందుకు సాగాడు.

తరవాత వాళ్ళు ఉపాయంగా కోటలో ప్రవేశించి, రాజుగారి ఖజానాలో నగలూ, నాణాలూ దొంగతనం చేసి, ఇల్లు చేరుకుని, తెచ్చిన సొమ్ము ఇంటిపెరట్లో పాతి పెట్టారు.

మర్నాడు ఉదయం రాజుగారికి దొంగతనం సంగతి తెలిసింది. దొంగల ఆచూకీ తీసేపని మంత్రి పైన పడింది. ఆయన విచారించగా, ఊరి బయట కొబ్బరితోట మధ్య ఉన్న గుడిసెలో నలుగురు అన్నదమ్ములున్నారనీ, వాళ్ళ వృత్తి దొంగతనాలు చెయ్యటమేననీ తెలియ వచ్చింది. పోయిన నగలూ, నాణాలూ తిరిగి సంపాదించటానికి మంత్రి ఒక ఎత్తువేశాడు.

సి. హెచ్. ఎల్. నరసింహాచార్యులు

ఆయన భయంకరమైన కాళీమాత వేషం వేసుకుని, కత్తి చేత పట్టుకుని, అర్ధరాత్రివేళ కొబ్బరితోట లోని గుడిసె వద్దకు వెళ్ళి, భీకరంగా గర్జించాడు.

ఆ గర్జన విని నలుగురు అన్నదమ్ములూ దీపం తీసుకుని బయటికి వచ్చి, మహా కాళి ఆకారాన్ని చూసి బెదిరిపోయి, "అమ్మా, తల్లీ! నువ్వెవరు? నీకేం కావాలి?" అని అడిగారు.

మంత్రి వాళ్ళతో, "నేను కాళీమాత నురా! రాజుగారి కోటలో దొంగిలించిన సొత్తంతా ఇక్కడ పెట్టండి! లేకపోతే మిమ్మల్ని నరికేసి, మీ రక్తం తాగుతాను!" అన్నాడు.

దొంగలలో ముగ్గురు మాత్రం ఈ మాటలు విని గడగడా వణికిపోయారు. వాళ్ళకు ఏమనాలో తెలియలేదు. కాని, నాలుగోవాడు ఒక దుడ్డుకర్ర తెచ్చి, "ఎవడివిరా నువు? కాళీమాతవా? వెళ్ళిపోతావా? దుడ్డు కర్రతో తల పగల గొట్టమన్నావా?" అని అరిచాడు.

వెంటనే మంత్రి కాలిసత్తువ కొద్దీ పారిపోయాడు. తరవాత మిగిలిన వాళ్ళు ముగ్గురూ వాడితో, "ఆ వచ్చినది మనిషే నని నీ కెట్లా తెలిసిందిరా?" అన్నారు.

"మనం దొంగతనానికి పోయేటప్పుడు అనుకోకుండా పురాణం విన్నాను. దేవతలూ, దయ్యాలూ భూమి మీది కొస్తే వాళ్ళ పాదాలు భూమిని అంటవుట; వాళ్ళ నీడ భూమి మీద పడదుట. ఈ వచ్చినవాడు మనిషి. వాడికాళ్ళు భూమి మీదే ఉన్నాయి. మన దీపం వెలుతురులో వాడి నీడ భూమి మీద పడింది. అది చూసి వాడు మనిషేనని తెలుసుకున్నాను," అన్నాడు నాలుగోవాడు.

"ఒరే, నువు కొంచెంగా పురాణం వింటేనే ఇంతలాభం కలిగింది గదా, మనం రోజూ పురాణం వింటే ఇంకా ఎంతలాభం కలుగుతుందో!" అనుకుని ఆ అన్నదమ్ములు రోజూ పురాణం వినటం ప్రారంభించి, దొంగతనాలు మానేసి, మంచి వాళ్ళని పేరు తెచ్చుకున్నారు.






# చెవుడుచేసినమేలు

ఒక గ్రామంలో రత్తయ్యా అనే చెవిటి కుర్రవాడు ఉండేవాడు. వాడి తల్లి చని పోయింది. తండ్రి మళ్ళీ పెళ్ళి చేసు కున్నాడు. రత్తయ్యను సవతితల్లి చాలా బాధలు పెట్టేది. పొలం పనులతోబాటు వాడు ఇంటి పనులన్నీ చెయ్యవలసి వచ్చేది. వాడు ఎంత పని చేసినా, ఒళ్ళు దాచుకుని ఏ పనీ చెయ్యటం లేదని సవతి తల్లి వాడి మీద కసురుకుని, నానాతిట్లూ తిట్టేది.

కొడుకు పడే పాట్లు చూస్తూ కూడా రత్తయ్యా తండ్రి తన రెండో భార్యకు భయపడి, ఏమీ అనలేక లోలోపల బాధ పడేవాడు.

ఒకరాత్రి రత్తయ్యా పశువుల కొట్టాంలో పడుకుని నిద్రపోబోతూ ఉండగా, తన సవతితల్లి కర్రతో సహా తాను ఉన్న వైపు రావటం కనబడింది. ఆ అర్ధరాత్రి వేళ ఆమె తనను చంపటానికి వస్తున్నదని భయపడి రత్తయ్యా చడీ చప్పుడూ కాకుండా లేచి చీకట్లో ఎటో పారిపోయాడు.

అలా ఇంటి నుంచి పారిపోయిన రత్తయ్యా తిరిగి తిరిగి చివరకు ఒక నగరం చేరాడు.

ఆ నగరాన్ని పాలించే రాజు వట్టి అమాయకుడు. ఆయనకు ఒక కల వచ్చింది. తన పెద్దరాణి కుమార్తెను చిన్నరాణి చంపటానికి ప్రయత్నించి నట్టు రాజు కలగన్నాడు. వెంటనే మేలు కుని ఆయన కలవరపడ్డాడు.

ఆ రాజు మర్నాడు సభలో తన సభికు లను ఉద్దేశించి, ''నిన్న రాత్రి నేను ఒక కలగన్నాను. ఆ కల ఏమిటో ఎవరైనా చెప్పగలరా? చెప్పిన వారికి వెయ్యి రూపాయలు బహుమానం ఇస్తాను,'' అన్నాడు.

ఏ. ముద్దుకృష్ణ

ఎవరూ ఏమీ అనలేదు. రాజు తెలివి తేటలు వాళ్ళకు తెలుసు.

ఎవరూ మాట్లాడకపోయేసరికి, రాజు మంత్రి కేసి తిరిగి, ''నాకు వచ్చిన కల ఏమిటో చెప్పగల వాళ్ళు ఇక్కడ లేన ట్టుంది. ఈ విషయం దండోరా వేయిం చండి,'' అన్నాడు.

ఆ దండోరా వేసే సమయానికి రత్తయ్య నగరం చేరి, చాటింపు చూశాడు. కాని చెవిటివాడు కావటం చేత వాడికి రాజు గారి ప్రకటన సరిగా వినిపించలేదు; ప్రజలు తమ కష్టాలు రాజుగారితో చెప్పు కోవచ్చునని దండోరా వేస్తున్నట్టు వాడికి అర్థమయింది.

వెంటనే వాడు రాజభవనానికి దారి అడిగి తెలుసుకుని, అక్కడికి వెళ్ళాడు. ద్వారం వద్ద రాజభటులు వాణ్ణి అడ్డగించి, ''రాజుగారి కలను గురించి చెప్పగలవా?'' అని అడిగారు.

వాళ్ళ మాటలు వినపడక, ''ఔను!'' అన్నాడు రత్తయ్య.

భటులు వాణ్ణి తీసుకుపోయి రాజు గారి ముందుపెట్టారు.

''నాకు వచ్చిన కల గురించి చెబు తావా?'' అని రాజు వాణ్ణి అడిగాడు.

రాజుగారు తన కష్టాలు చెప్పమంటు న్నాడనుకుని రత్తయ్య, ''మహారాజా, సవతి తల్లుల అసూయా, వాళ్ళు పెట్టే బాధలూ అనాదిగా వస్తున్నవే. వాటిని గురించి వివరంగా చెప్పాలా? అయినా-'' అని ఇంకేదో చెప్పబోయాడు.

కాని రాజుగారు సంతోషంతో, ''భేష్!'' అని, వాడికి వెయ్యి రూపాయలు బహు మానం ఇచ్చి, పంపేశాడు.

రాజుగారు తన కథ పూర్తిగా వినకుం డానే బహుమానం ఇచ్చినందుకు రత్తయ్య ఎంతో సంతోషించి, ఇంటికి తిరిగి వెళ్ళి, జరిగినదంతా తన తండ్రికి చెప్పాడు.

అదంతా విన్న వాడి సవతితల్లి, రాజు గారి అండ వాడికి ఉన్నదని భయపడి, వాణ్ణి బాధలు పెట్టటం మానేసింది. రత్తయ్య కష్టాలు గట్టెక్కాయి.






అయితే వాలి మాయావి చేతిలో చావలేదు, తానే మాయావిని చంపి తిరిగి వచ్చాడు. తిరిగి వచ్చిన వాలికి సుగ్రీవుడు గౌరవంగా నమస్కారం చేశాడు. వాలి సుగ్రీవుణ్ణి ఆశీర్వదించక, అతన్ని కోపంగా చూసి, తిట్టిపోశాడు. సుగ్రీవుడు తన కిరీటం తీసి వాలి పాదాల వద్ద పెట్టి, అతనికి సాష్టాంగనమస్కారం చేశాడు.

వాలి కోపం పోగొట్టటానికి సుగ్రీవుడు, "ఆహా, అన్నా! నువు శత్రువును చంపి తిరిగి రావటం నా మహాభాగ్యం. అంత కన్న మాకందరికీ సంతోషం ఏమున్నది? నేను బిలం దగ్గిర ఎంతో సేపు నిలబడ్డాను. అందులో నుంచి రక్తం బయటికి వచ్చి నప్పుడు నాకు కలిగిన దుఃఖం ఏమని చెప్పను? అప్పుడా బిలాన్ని కొండరాయితో కప్పిపెట్టి, కిష్కింధకు తిరిగి వచ్చాను. నేను రాజ్యాభిషేకం కోరలేదు. పౌరులూ, మంత్రులూ రాజుండాలని పట్టుబట్టి నాకు రాజ్యాభిషేకం చేశారు. ఇప్పుడు నువే రాజువు, నేను యువరాజును. నన్ను అపార్థం చేసుకోకు," అన్నాడు.

కాని సుగ్రీవుడి మాటలను వాలి విని పించుకోలేదు. అతను అందరినీ పిలిచి, వారి ఎదట సుగ్రీవుణ్ణి నానా మాటలూ అన్నాడు:

"వీడూ, నేనూ మాయావిని తరుము కుంటూ వెళ్లాం. మాయావి ఒక భయంకరమైన బిలంలో దూరాడు. వాణ్ణి చంపి గాని కిష్కింధకు తిరిగి రానని శపథం

3. సుగ్రీవస్నేహం



చేసి, ఈ సుగ్రీవుణ్ణి బిలద్వారం వద్దనే ఉండమని చెప్పి, లోపలికి వెళ్ళాను. బిలంలో నాకు మాయావి ఒకంతట దొరకలేదు. శ్రమపడి వాణ్ణి వెతికి, పట్టుకుని చంపి, వాడి వాళ్ళనందరినీ చంపి తిరిగి వచ్చేసరికి, బిలద్వారం కూడా నాకు కనిపించలేదు. 'సుగ్రీవా' అని కేకలు పెట్టితే జవాబు లేదు. ఈ దుర్మార్గుడు రాజ్యం కోసం ఆ బిలాన్ని మూసి, నన్ను బయటికి రాకుండా చేద్దామనుకున్నాడు. బిలానికి అడ్డంగా ఉన్న రాతిని తన్ని పగలగొట్టి వచ్చేశాను.''

ఇలా అని వాలి సుగ్రీవుణ్ణి కట్టుబట్టలతో వెళ్ళగొట్టాడు, సుగ్రీవుడి భార్య అయిన తారను తన భార్యగా చేసుకున్నాడు. సుగ్రీవుడు వాలి భయంకొద్దీ ఋశ్యమూకపర్వతం మీద తల దాచుకున్నాడు. ఈ వనవాసంలో సుగ్రీవుడి వెంట హనుమంతుడూ, జాంబవంతుడూ, మైందుడూ, ద్వివిదుడూ అనే వానరులు అతని మంత్రులుగా ఉన్నారు.

సుగ్రీవుడి వెంట ఉంటున్న సమయంలోనే హనుమంతుడికి రాముడితో పరిచయం కలిగింది. అది ఇలా జరిగింది.

ఋశ్యమూకం మీద ఉన్న సుగ్రీవుడు ఒకనాడు పంపాసరోవరం పక్కన ఉన్న వనంలో ఇద్దరు మనుషులు సంచరిస్తూ ఉండటం చూశాడు. వాళ్ళు ధనుర్బాణాలు ధరించి, చూడటానికి చాలా అద్భుతంగా ఉన్నారు. వాళ్ళను చూస్తూనే సుగ్రీవుడు భయపడిపోయాడు. వాళ్ళు వాలి పంపిన మనుషులు అయి ఉంటారనీ, వాలి ఋశ్యమూకపర్వతం మీదికి రాకూడదని శాపం ఉన్నది గనక, తనను చంపించటానికి ఎవరినో పంపాడనీ సుగ్రీవుడు అనుకున్నాడు. అతను కాలు కాలిన పిల్లిలాగా తిరుగుతూ, ఎక్కడికైనా పారిపోవాలనుకుంటున్నాడు.

అప్పుడు హనుమంతుడు సుగ్రీవుడితో, ''వాలి ఇక్కడికి రాలేదు. అతను వచ్చిన జాడ లేదు. భయం దేనికి?'' అన్నాడు.



"వాలి వచ్చాడని నేను అనలేదు. ఆ ఇద్దరు మనుషులనూ చూడు. వాళ్ళ వద్ద ఉన్న ధనుర్బాణాలూ, ఖడ్గాలూ చూడు. వాళ్ళను చూస్తే ఎవరికైనా భయం కలిగితీరుతుంది. వాళ్ళను వాలి నాపైకి పంపాడని నా అనుమానం. రాజైన వాడికి ఎందరో సహాయకులు ఉంటారు. మనం గూఢచారులను గురించి ఏమరి ఉండరాదు; ఉంటే చచ్చిపోతాం. రాజులు శత్రువులను నాశనం చెయ్యటంలో అనేక ఉపాయాలు ఆలోచిస్తారు. అందులోనూ వాలి మహా తెలివిగలవాడు. చూడు, హనుమంతుడా! నువు వెళ్ళి, వాళ్ళు మాట్లాడుకునే మాటలు విని, వాళ్ళు మంచివాళ్ళో, దుర్మార్గులో తెలుసుకో. వాళ్ళు అరణ్యాలలో ఆయుధాలు ధరించి ఎందుకు తిరుగుతున్నారో అడుగు. వారికి నా మీద ఏదైనా ద్వేషభావం ఉంటే దాన్ని పోగొట్టి, నాపై వారికి సద్భావం కలిగేటట్టు చెయ్యి," అన్నాడు సుగ్రీవుడు.

అలాగే చేస్తానని చెప్పి, హనుమంతుడు రామలక్ష్మణులు సంచరిస్తున్న చోటికి బయలుదేరాడు. అతను తన వానర రూపాన్ని మార్చుకుని ఒక బ్రహ్మచారి రూపం ధరించి, రామలక్ష్మణులను సమీపించి, అతి వినయంగా, "అయ్యలారా, మిమ్మల్ని చూస్తే రాజర్షులు గానూ, దేవతా సమానులు గానూ, తపోవ్రతం పూనినవారు గానూ కనిపిస్తున్నారు. మీరు ఈ పంపా తీరానికి ఎలా వచ్చారు? మీరెవరు? మిమ్మల్ని చూసి ఇక్కడి వన్యమృగాలు బెదిరిపోతున్నాయి! మీ విశాలమైన భుజాలూ, ఏనుగుతొండాల వంటి చేతులూ చూస్తే, సమస్తమైన ఆభరణాలూ ధరించి, రాజ్యాలు ఏల దగినవారిలా ఉన్నారు," అన్నాడు.

రామలక్ష్మణులు మాట్లాడ లేదు.

తిరిగి హనుమంతుడే ఇలా ఉన్నాడు: "సుగ్రీవుడనే వానరరాజు మహా ధర్మాత్ముడు, గొప్ప బలశాలి. అన్న వెళ్ళ



గొట్టగా అయన చాలా ఇక్కట్లు పడుతున్నాడు. నేను ఆయన మంత్రిని, హనుమంతుడనే వానరుణ్ణి. సుగ్రీవుడు పంపగా ఋశ్యమూకం నుంచి వచ్చాను. నేను కామరూపుణ్ణి. అందుచేత ఈ బ్రహ్మచారి వేషం ధరించి వచ్చాను. ఎక్కడికైనా వెళ్ళగల శక్తి నా కున్నది. సుగ్రీవుడు మీ స్నేహం కోరుతున్నాడు."

ఈ మాట వినగానే రాముడి ముఖం సంతోషంతో వికసించింది. రావణుడు ఎత్తుకుపోయిన సీతను తిరిగి సంపాదించటానికి వానరరాజైన సుగ్రీవుడి సహాయం పొందమని కబంధుడు రాముడికి చెప్పి ఉన్నాడు.

రాముడు లక్ష్మణుడితో, "తమ్ముడూ, వెదకబోయిన తీగ కాళ్ళకు చుట్టుకున్నట్టు, మనం చూద్దామనుకుంటున్న సుగ్రీవుడే మనకోసం తన మనిషిని పంపాడు. ఇతను చాలా బుద్ధిమంతుడుగా కనిపిస్తాడు. మాట్లాడుతున్నంతసేపూ ఇతని ముఖం చాలా నిర్మలంగానూ, నిష్కపటంగానూ ఉన్నది. ఇతనితో నువు మాట్లాడు," అన్నాడు.

లక్ష్మణుడు హనుమంతుడితో, "సుగ్రీవుడి సుగుణాలు మాకు తెలిసినవే. మేం ఆ సుగ్రీవుణ్ణే వెతుక్కుంటూ వస్తున్నాం. నువు కోరినట్టే మేం సుగ్రీవుడితో స్నేహం చేసుకుంటాం," అన్నాడు.

రాముడికి సుగ్రీవుడి వల్ల ఏదో పని ఉన్నది; కాబట్టి రాముడు సుగ్రీవుడికి తిరిగి రాజ్యం వచ్చేటందుకు తోడ్పడ వచ్చునని హనుమంతుడు ఊహించి, సంతోషం పొంది, "మీ రిద్దరూ అసలు భయంకరమైన దండకారణ్యానికి ఎందుకు వచ్చారు?" అని అడిగాడు.

రాముడు లక్ష్మణుణ్ణి తమ వృత్తాంతం చెప్పమన్నాడు. లక్ష్మణుడు ఇలా చెప్పాడు:

"ఇతను దశరథమహారాజు పెద్ద కొడుకు, రాముడు. రాజు కావలసినవాడు. తండ్రి మాట దాటనివాడు. అలాటివాడు రాజ్యభ్రష్టుడై, నాతో కూడా

వనవాసం వచ్చాడు. మాతోబాటు ఇతని భార్య సీతాదేవి కూడా వనానికి వచ్చింది. నేను ఇతని తమ్ముణ్ణి. నా పేరు లక్ష్మణుడు. ఈ రాముడి గొప్ప గుణాలకు నేను దాసుణ్ణి. మేం లేని సమయంలో ఎవడో రాక్షసుడు ఇతని భార్యను అపహరించి తీసుకుపోయాడు. వాడెవడో మాకు తెలియదు. ఆ రాక్షసుడి జాడ సుగ్రీవుడి ద్వారా తెలుస్తుందని మాకు మరొక రాక్షసుడు చెప్పాడు. అడిగావు గనక, మా సమాచారం దాచకుండా నీకు చెప్పాం. ఎంతటి వారికైనా శరణు ఇయ్యగల ఈ మహాపురుషుడు ఇప్పుడు సుగ్రీవుడి శరణు కోరుతున్నాడు. సుగ్రీవుడు అనుగ్రహించాలి.''

దానికి హనుమంతుడు, ''మా రాజు సుగ్రీవుడే మిమ్మల్ని వెతుక్కుంటూ రావలిసిన పరిస్థితి. తన రాజ్యాన్నీ, భార్యనూ వాలి కాజేయటం చేత ఆయన చాలా విచారకరమైన స్థితిలో ఉన్నాడు. సీతాదేవిని వెతకటానికి ఆయన మీకు సహాయపడగలడు.'' అన్నాడు.

తరవాత అతను వారిని సుగ్రీవుడి వద్దకు రమ్మన్నాడు.

లక్ష్మణుడు రాముడితో, ''మనం సుగ్రీవుడి వద్దకు పోదాం. అతని సహాయం వల్ల నీ కార్యం నెరవేరుతుంది.'' అన్నాడు.



వెంటనే హనుమంతుడు తన బ్రహ్మచారి రూపం వదిలిపెట్టి, వానరరూపం ధరించి, రామలక్ష్మణులను తన భుజాలపై ఎక్కించుకుని, ఋశ్యమూక పర్వతం మీదికి వెళ్ళాడు. అయితే సుగ్రీవుడు ఋశ్యమూకపర్వతం మీద లేడు. సమీపంలోనే ఉన్న మలయపర్వతం మీద భయంతో దాక్కున్నాడు.

హనుమంతుడు మలయపర్వతం మీద ఉన్న సుగ్రీవుణ్ణి కలుసుకుని, ''ఆ వచ్చిన వాళ్ళు రామ, లక్ష్మణులు. ఇక్ష్వాకు వంశంలో పుట్టినవాళ్ళు. దశరథమహారాజు కొడుకులు. రాముడు నియమం పాటించి అరణ్యవాసం వచ్చాడు. అతని



భార్యను ఎవడో రాక్షసుడు ఎత్తుకు పోయాడు. అందుచేత ఆ రాముడు నిన్ను శరణు జొచ్చాడు. అన్నదమ్ము లయిన రామ, లక్ష్మణులు నీ స్నేహం కోరుతున్నారు. వీరిని చేరదీసి ఆద రించు,'' అన్నాడు.

ఈ మాట విని సుగ్రీవుడు ఎంతో సంతో షించాడు. అతను అందమైన మానవుడి రూపం ధరించి, రామలక్ష్మణుల వద్దకు వచ్చి, ''మిమ్మల్ని గురించి హనుమం తుడు నాతో అంతా చెప్పాడు. రాజువైన రామా, నువు నా వంటి వానరుడి స్నేహం కోరటం నాకు ఎంతో గౌరవమూ, లాభ దాయకమూనూ. నీకు నా స్నేహం కావా లంటే నా చేతిలో చెయ్యివేసి, స్నేహ ధర్మం నిర్వర్తించు,'' అన్నాడు.

రాముడు సుగ్రీవుడి చేతిలో చెయ్యి వేసి, అతన్ని గాఢంగా కౌగలించు కున్నాడు. అప్పుడు హనుమంతుడు అరణి మథించి అగ్నిచేసి, ఆ అగ్నిని పూజించి, రాముడికీ, సుగ్రీవుడికీ మధ్యగా దాన్ని ఉంచాడు. రామ, సుగ్రీవులు ఆ అగ్నికి ప్రదక్షిణం చేసి, అగ్నిసాక్షిగా సఖ్యం చేసుకున్నారు.

రాముడు సుగ్రీవుడితో, ''నువు నాకు స్నేహితుడవయావు. ఇక నీ దుఃఖమే నా దుఃఖం, నీ సుఖమే నా సుఖం,'' అన్నాడు.

సుగ్రీవుడు దట్టమైన ఆకులు గల ఒక మద్దికొమ్మ విరిచి, దానిపైన రాము డితో సహా కూర్చున్నాడు. లక్ష్మణుడు కూర్చోవటానికి హనుమంతుడు ఒక చందనవృక్షం కొమ్మ విరిచాడు.

తరవాత సుగ్రీవుడు తనకూ, వాలికీ మధ్య వైరం ఎలా వచ్చినదీ వివరంగా చెప్పాడు. అంతా చెప్పి అతను రాము డితో, ''వాలి భయంతో నేను కుంగి పోయి ఉన్నాను. నా భయం తొలగించు,'' అన్నాడు.

రాముడు వాలి సుగ్రీవుల వృత్తాంత మంతా విని, చిరునవ్వు నవ్వుతూ,

"స్నేహానికి ఉపకారమే ఫలం. నీ భార్యను కాజేసిన వాలిని నేను చంపుతాను." అన్నాడు.

సుగ్రీవుడు ఈ మాటకు ఎంతో సంతోషించి, "రామా, నీ దయవల్ల నాకు నా భార్యా, రాజ్యమూ తిరిగి రావాలి. అందుకోసం నువు వాలిని చంపే ప్రయత్నం చెయ్యి. సీతాదేవిని నేను నీకు తెచ్చి యిస్తాను. ఆమె పాతాళంలో ఉండనీ, స్వర్గంలో ఉండనీ, నేను ఆమెను తెచ్చి యివ్వటం మటుకు నిజం. ఇప్పుడు నాకు జ్ఞాపకం వస్తున్నది—నేను చూసినది సీతే అయి ఉండాలి. ఆమె నన్నూ, నా వెంట ఉన్న నలుగురు వానరవీరులనూ చూసి, మా ముందు నగలమూట పడవేసింది. వాటిని దాచి ఉంచాను. వాటిని నువు గుర్తించగలవేమో చూడు." అన్నాడు.

రాముడు ఆత్రంగా, "మిత్రమా, వాటిని వెంటనే తెచ్చి నాకు చూపించు." అన్నాడు.

సుగ్రీవుడు వెంటనే లేచి ఒక గుహలోకి వెళ్ళి, సీతాదేవి పై బట్టలో మూట గట్టి ఉన్న అందమైన ఆభరణాలను తెచ్చి రాముడి ముందు పెట్టి, "చూడు!" అన్నాడు.

రాముడు వాటిని చూస్తూనే, "హా సీతా!" అని పడిపోయి, కంట నీరు కార్చుతూ, నిట్టూర్పులు విడవసాగాడు. అతను లక్ష్మణుడితో, "లక్ష్మణా, రాక్షసుడు తనను తీసుకు పోయేటప్పుడు సీత ఈ నగలను మెత్తని గడ్డి గల ప్రాంతంలో పడవేసి ఉంటుంది. అందుచేతనే ఇవి చెక్కుచెదరకుండా ఉన్నాయి." అన్నాడు.

లక్ష్మణుడు రాముడితో, "ఈ కేయూరాలూ, కుండలాలూ నేను గుర్తించలేను. కాని సీత కాళ్ళకు రోజూ నమస్కరించేటప్పుడు కనిపించే ఈ అందెలను గుర్తించగలను." అన్నాడు.

రాముడు దీనంగా సుగ్రీవుణ్ణి, "నువు చూస్తూండగా ఆ రాక్షసుడు సీతను ఎటుగా తీసుకు పోయాడు?" అని అడిగాడు.






వ్యసనే వార్థకృచ్ఛ్రే వా,
భయే వా జీవితాంతకే,
విమృశన్వై స్వయా బుద్ధ్యా
ధృతిమా న్నావసీదతి. 1

[దుఃఖం గాని, ధననష్టం గాని, ప్రాణభయం గాని కలిగినప్పటికీ ధైర్యవంతుడు బుద్ధి చేత విమర్శిస్తాడు గాని, దుఃఖించడు.]

బాలిశస్తు నరో నిత్యం
వైక్లబ్యం యోనువర్తతే,
స మజ్జత్యవశ శ్శోకే
భారాక్రాన్తేవ నౌ జలే. 2

[తెలివిమాలి ఎప్పుడూ దైన్యంతో ఉండే వాడు, బరువైన నావ నీటిలో మునిగి పోయినట్టు దుఃఖంలో మునిగిపోతాడు.]

యే శోక మనువర్తన్తే
న తేషాం విద్యతే సుఖమ్,
తేజశ్చ క్షీయతే తేషాం,
న త్వం శోచితు మర్హసి. 3

[ఎప్పుడూ దుఃఖించే వాడికి ఏ సుఖమూ ఉండదు. వాళ్ళ పరాక్రమం నశిస్తుంది. అందుచేత నువు దుఃఖించకు.] —వాల్మీకి

దుః ఖ ం

Chandamama, December '74 Photo by B. Bhansali



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఐరావతము గాదు

పంపినవారు :
యడవల్లి కౌసల్యాదేవి

Photo by T. Madan Gopal



తిరువూరు.
(కృష్ణా జిల్లా)

ఐదు పైసలు చాలు

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







* వ్యాఖ్యలు డిసెంబర్ 20వ తేదీలోగా చేరాలి. వ్యాఖ్యలు పోష్టుకార్డు పైనమాత్రమే రాయాలి.
* వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
డా లి యా

మూడవ అట్ట:
క లు వ


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3 Arcot Road, Madras-600026. Controlling Editor : 'CHAKRAPANI'

*Photo by:* V. MUTHURAMAN



WATER-LILY

